అని నన్నయ వ్యాసభారతమును ప్రశంసించెను. ఆ ప్రశంస తెలుగు భారతమునకుగూడ యథాక్షరముగ నన్వయించును. మహాభారతము పంచమ వేదము. విజ్ఞానసర్వస్వము. ఆంధ్రులను ధర్మవీరులుగా లోకోత్తర పురుషులుగా దిద్ది మహాసామ్రాజ్యమును నెలకొల్పుట రాజరాజనరేంద్రుని అభిమతము. విద్యా ప్రబోధమనిన 'అక్షరాస్యత'అని పూర్వీకుల అభిప్రాయముగాదు. ఆనాడు విశ్వవిజ్ఞానకోశము అనదగిన మహాభారతమును ఆంధ్రభాషలో ననువదించుట కంటె విద్యాప్రబోధమేమున్నవి. అందుచే విశ్వశ్రేయమును కాంక్షించి నన్నయ భట్టు

"తెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురుఁడయ్యె"

ఆధ్యాత్మిక ప్రబోధమునకుఁ దత్త్వ విద్యోపదేశమునకు మహాభారతము మునుముందు పేర్కొనవలసినగ్రంథము. ఉపనిషత్సారముగను, బ్రహ్మవిద్యోపదేశముగను బెరొందిన శ్రీమద్భగవద్గీత మహాభారతములోనిది. ఏనాడో కురుక్షేత్రమున పరమపురుషుడు పూరించిన పాంచజన్య శంఖారావము గీతానాదముగ తరంగితమై నేటికిని భారతీయుల హృదయములలో ప్రతిధ్వనించుచున్నది. జీవితసమరమున నరుడు విజయుడై కర్మవీరుడగుటకు నింతకంటె నమృతసందేశమేమున్నది? హృదయ దౌర్బల్యము, కర్తవ్యదర్శనము నణచినపుడు స్వధర్మములను పరిత్యజించి గీతాపురుషుని శరణన్నచో విజయద్వారము వివృతముగాదా? భారతపుత్రులు నిర్వీర్యులై పోకుండ సదాకర్మవీరులుగ ధర్మశీలురుగనీగీతానాదమే పురికొల్పగలదు. గీతామృతము భారతీయ సంస్కృతికజరామరమైన నిత్యయౌవనము నొసంగుచున్నది. జీవితమొక కర్మక్షేత్రము. ఆత్మకు మరణములేదు. ఆత్మను నీరు తడుపలేదు. నిప్పు కాల్పలేదు, ఆత్మ సనాతనము, అనంతము. ద్వంద్వబద్ధమైన ప్రాణికోటికెంతటి యాశాసందేశము!

మహాభారతము బహు పురాణసముచ్చయము. కురువంశముయొక్క ఇతిహాసము మహాపురాణమైనది చరిత్రకంటె భిన్నముకావచ్చును. చారిత్రకసత్యము సర్వదాసాపేక్షికమైన సత్యము ఏదోయొకచోట నొకస్థలమున నొకకాలములో మాత్రమే యథార్థము కాని పౌరాణికసత్యము దేశకాలపాత్రాతీతమై నిరవధికమై నిర్వికల్పమైనసత్యము. నిత్యనూతనము సదాసనాతనము. క్షీరసాగరమథనము, వృత్రాసురసంహారమునిట్టిసత్యములే. ఉపాఖ్యానములు అవాంతరగాధలు. గీతతో మానవజీవితములోని యనేకచిత్రములను నంతర్గర్భితముగ నర్థవాద రూపముగ

ప్రదర్శించుటకొఱకే కల్పింపబడినవి. ఇవి వ్యావహారికసత్యములు కానంతమాత్ర మున యథార్థములు కాకపోవు. భారతములోని నీతులు విశ్వజనీనములు. భూలో కమున నవతరించిన మానవునకు స్వర్గారోహణమునకు దారిచూపుచున్న మహాభార తము సార్వకాలిక మానవచరిత్ర. ఈ పరమసత్యమును సంపూర్ణముగ సాక్షా త్కరింపఁజేసికొనిన ఋషికల్పుఁడు నన్నయమహాకవి యాంధ్రమహాభారతము నారంభించిన యాదికవి

ఆంధ్ర వాఙ్మయమున భారతభాగవతములకు విశేషప్రఖ్యాతియున్నది. ఏవాఙ్మయములోనైనను చతుర్విధ కవితారీతులు సుప్రసిద్ధములు.

1. కథా కథనరీతి-లేక ఆఖ్యానశైలి
2 నాటకీయశైలి
3 వర్ణనాత్మకశైలి-ప్రబంధరీతి
4. భావకవితాశైలి.

తెలుగులో ఆఖ్యానశైలికి నన్నయ, నాటకీయశైలికి తిక్కన, వర్ణనాత్మక శైలికి ఎఱ్ఱన, ఆత్మాశ్రయమైన భావకవితాశైలికి పోతన మూలపురుషులయినారు. అందుచే వారు మహాకవులు కాగలిగినారు

నన్నయ తన కవితాశిల్పమునుగూర్చి చెప్పుకొన్న పద్య ముదాహరింప దగును

సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్.

అనగా నన్నయకవిత్వమును వింగడించినచో తేలు సారాంశము —

1. ప్రసన్న కథాకలితార్థయుక్తి 2 అక్షరరమ్యత 3. నానారుచిరార్థ సూక్తి నిధిత్వము. 4. జగద్ధితత్వము పైలక్షణములకు నన్నయ మహాభారతమంతయు నుదాహరణప్రాయమే గంగమానవకన్యకయై ప్రతీపనృపాలుని చేరిన సన్నివేశ ముదాహరణీయము

గంగ నిజాంగదీప్తు లెసగం దను దెంచి లతాంగి సంగతో
త్తుంగపయోధరద్వితీయతోయరుహానన చారునేత్ర ది
వ్యాంగనయై ప్రతీప వసుధాధిపు శాల విశాల దక్షిణో
త్సంగమునందు మన్మధవశంబున నుండె కరంబు లీలతోన్

ఆంధ్ర కవితాగానమునకు మృదంగ వ్యాపారమును నిర్వహించునట్లు ఛందస్సు-యతిప్రాసలను ప్రయోగించు నొరవడి తరువాతి పురుషాంతరములకు నన్నయ మహాకవి ప్రసాదించెను : బిందుపూర్వక 'గ' కారప్రాసము జలతరంగిణి వలె మ్రోగుచున్న యీ పద్యమున యతిప్రాసలు, పదములు చెప్పలేని యద్భుత భావమునెట్లు సుగమ్యమొనరించుచున్నదో రసజ్ఞహృదయులకు స్వయంవిదితము. సంస్కృత కవిత్వమున నిట్టిపద్యరచనాశిల్పము మృగ్యము. నన్నయమహాకవి యొరవడిగా దిద్దిన పద్యశిల్పమే తెలుగు మహాభారతమును, సంస్కృతమహాభారతముకంటె దేశభాషలందలి భారతములకంటె విశిష్టమైనదానిగ, "దేశభాషలందు తెలుగు లెస్స' నొనరించినది.

శ్రీకృష్ణుడు ధర్మరాజునకు పదునాలుగువేల మత్తేభములను రాజసూయ యాగమున బహుమానముగ నొసగినట్లు దుర్యోధనుడు తండ్రికి నివేదించెను

మండిత సూర్యరశ్మిరుచి మన్మణిహారచయంబుతో కట
స్యందిసుగంధిదానజలసంపద నొప్పెడువాని దేవకీ
నందనుఁడిచ్చెఁ బ్రీతిఁబదునాలుగువేల గజంబులన్ జనా
నందన కీర్తియైన యమనాథతనూజున కిష్టమిత్రుడై.

పదునాలుగువేల మత్తేభములు కనుచూపుమేర కందకుండ గదలివచ్చుచున్నవి. ఆ మత్తేభములు అలంకృతములు. హారములతో ననేకమణులతో ప్రతిఫలించు సూర్యరశ్మి, సూర్యకాంతిని మందితనుచేయుచున్నది. "మండిత సూర్యరశ్మి రుచిమన్మణిహారచయంబుతో"—"కటస్యంది సుగంధి దానజలసంపద నొప్పెడువాని"—యీ దీర్ఘసమాసములు ఏతదుచ్చారణవలన బుట్టు నాదము, బిందుపూర్వక 'ద' కారప్రాస ప్రయోగ పౌనఃపున్యము మత్తేభ యూధములగంభీర గమనమును స్ఫురింపజేయును. "ఉచ్చారణదక్షుడు" నన్నయమహాకవి రచించిన యీపద్యమును బఠించినచో, దెనుగురాని వాడుకూడ కదలివచ్చెడి ఏనుగుల గంభీరయానమున మ్రోగుచున్న చిఱుగంటల మృదులయాన్విత నినాదమును

గూడ గుర్తింపగలడు. ప్రసన్న కథాకలితార్థయుక్తి నాదరింపగలడు. మహాభారతమువంటి మహాగాథలో నాద్యంతములనందుకొని యంతర్వాహినిగ బ్రవహించు వస్త్వైక్యము, కథాశిల్పము, ననురూపమైన ఛందస్సు, వ్యుత్పత్తి, ప్రతిభ, ఏవం గుణవిశేషణ విశిష్టత అంతయుఁ బ్రసన్న కథాకలితార్థయుక్తి. అంతమాత్రమే. గాక శబ్దార్థములకు-ఛందస్సునకు అతీతమైన నాదముచే ననుభవైకవేద్యమైన భావములను వ్యక్తీకరించు కవితాశిల్పమును సృష్టించిన కవులను విశ్వ సాహిత్య ప్రపంచమున వ్రేళ్ళపై లెక్కింపవచ్చును. అట్టి మహాకవులలో నన్నయ మేలు పూస. ఆంధ్ర మహాభారతము తెలుగుల సారస్వతవేదము.

దుశ్శాసనుడు ద్రౌపది వలువ లొలిచినపుడు భీముని ప్రతిజ్ఞాపద్యము—.

కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవులనేకుల్ సూచుచుండన్ మదో
ద్ధురుడై ద్రోవది నిట్లుచేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ ని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

ఈ పద్యమున 'కురువృద్ధుల్-గురువృద్ధబాంధవులు-మదోద్ధురుడై'- ఇత్యాది సమాసములు ద్విరుక్త 'ధ'కార ప్రయోగ సౌనఃపున్యము భీముని రౌద్రాకృతిని పఠితల మనోనేత్రములకు సాక్షాత్కరింపజేయుటయేగాక గదాదండప్రహరణ నినాదము వినిపించుచున్నట్లున్నది. "తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ నిర్ఝరముర్వీపతి" సమాసము నుచ్చరించుచుండ, భీముడు పండ్లు పటపటగొరికి నట్లు ధ్వనించును. ఈ పద్యములో నేపదమునకు నిఘంటువులిట్టి యర్థమును చెప్పకున్నను, ఉచ్చారణవలన జనించు నాదమువలన నిదంతయు స్వయంవ్యక్తమగును.

నన్నయనోట తెలుగుపదములు సంస్కృతసమాసములు నిష్టార్థ పద వ్యవచ్ఛిన్నములైయథోచితముగ వికసించును నన్నయ నానారుచిరార్థసూక్తినిధి. ఈ మహాకవికావ్యమున "ముక్తాహార సాంద్రపరాగ ప్రసరంబులు-శరత్ జ్యోత్స్నా ధవళ కాంతిరేఖాపంక్తులు-వికసన్నవకైరవ గంధబంధురోదార సమీర సౌరభములు, నవ్యనవనీత సమాన రుచిరవిన్యాసములు, నుత్తుంగ తరంగ ఘట్టితచల ద్వేలావనైలావలీవలీలుంగ లవంగసంగతలతాలాస్యంబులు, హరినీలవినీల విగ్రహారాళ వైదుర్యతరుచులు, నాంధ్రవాగ్విషయంబును దేజోమయంబొనర్చినవి.

# తిక్కనమహాకవి

నన్నయతరువాత తిక్కనమహాకవి ఆవిర్భావమువరకు సుమారు రెండు శతాబ్దులపాటు ఆంధ్ర మహాభారతము అసంపూర్తిగా ఆగిపోయినది. నన్నయ ఆది, సభాపర్వములు రెండును, అరణ్యపర్వములో కొంతభాగమును వ్రాసినాడు. ఆంధ్ర మహాభారతమేల ఆగిపోయినది. ఆంధ్రుల ఆరంభశూరత్వమునకిది నిదర్శనమని అధిక్షేపించువారును లేకపోలేదు. నన్నయకు-తిక్కనకు మధ్యకాలమున ఆంధ్రదేశములో అనేకకవులు వర్ధిల్లిరి. నన్నెచోడుడు-పండితారాధ్యుడు-పాల్కురికి సోమనాధుడు మున్నగు మహాకవులు ఈ మధ్యకాలమున వెలసినవారే. ఆంధ్ర వాఙ్మయములో నీకాలమునకు శివకవులయుగమని పేరు. శైవులలో నతివాదులు వీరశైవులు. నాటి సమాజములో వీరశైవులు గొప్ప విప్లవమును సాధించినారు. సంఘసంస్కరణమే వారి ప్రథమకర్తవ్యము. సాహిత్యము సంఘసంస్కరణమునకొకసాధనమాత్రము. వీరిదృష్టిలో మతముప్రధానము. "బహుదేవతోపాసన నానాకులసంకులమునయిన సంఘములో ముక్తికి భక్తిదాలు" అని శైవులు ప్రతిపాదించినారు. భక్తి అనగా "శివభక్తి" అని వారి నిర్వచనము. కావున వారి కావ్యములు స్వమతస్థాపన పరమతఖండనలతో నిండిపోయి సార్వజనీనములు కాకపోయినవి. వీరి గ్రంథములలో నుత్తమోత్తమ కవితయని చెప్పదగిన మహోదారభావములు-ఉత్కృష్టసృష్టియనిపించు సన్నివేశములు ఎన్నియోయున్నవి. శివకవులు ఆంధ్ర సారస్వతమునకు చేసినసేవ, జానుతెనుగునకు దేశికవితకు వారుకల్పించిన ప్రాముఖ్యము. వారు "ఆరూఢ గద్య పద్య భూయిష్ఠ రచనను" నిరసించినారు అంతేగాక అల్పాక్షరముల అనల్పార్థరచన ఆదర్శముగా ప్రకటించి ద్విపదకావ్యములల్లినారు. ప్రయోగసరణిలో నిరంకుశమైన వ్యాకరణ ధిక్కారమువారిరచనలలో గన్పించుచున్నది. కాని సాహితీలోకములోవారికిరావలసిన కీర్తిరాలేదు. చారిత్రకముగా వారు నన్నయ-తిక్కన మహాకవులమధ్యనున్నారు. ఇటు చంద్రాస్తమయము, అటు సూర్యోదయమునకు మధ్య శుక్రుని అలతిఅలతి కాంతులు ఎంత నిసర్గరమణీయములైనను లోకము చక్కగా దర్శింపలేదు.

నన్నయతరువాత రెండు శతాబ్దులతరువాత తిక్కనమహాకవి విరాటపర్వము నుండి పదిహేను పర్వములు ఆంధ్ర మహాభారతమున రచించినాడు. తిక్కన మనుమసిద్ధిమహారాజు నాస్థానమున మంత్రి ఆతని తొలిరచన నిర్వచనోత్తర రామాయణము అందుతో తన్నుగూర్చి "అమలోదాత్తమనీష నే నుభయ కావ్య ప్రౌఢిపాటించుశిల్పమునం బారగుడన్ గళావిదుడ"నని చెప్పుకున్నాడు కాని భారతరచన నాటికి ఆ అహంభావము "నానేర్చినభంగి చెప్పి వరణేయుడనయ్యెద భక్తకోటికిన్"-అను వినయముగా మారినది "విద్యయొసగును వినయంబు"అను భర్తృహరి సుభాషితమునకు తిక్కనమహాకవి జీవితము ప్రాణప్రతిష్టసల్పినది.

గజనీమహమ్మదు సోమనాధ దేవాలయముపై క్రీ॥శ॥ 1026 సంవత్సరమున జనవరినెలలో దండెత్తెను. అనగా రాజరాజనరేంద్రుడు రాజ్యమునకువచ్చిన 27 సంవత్సరములకు ఆకస్మికముగా సోమనాధ దేవాలయముపైబడి కాంచన మణిరత్నరాసులదోచుకొనిన గజనీమహమ్మదు నెదుర్కొనుటకు భోజమహారాజు దండెత్తి వెళ్ళెను

గజనీమహమ్మదు గజనీకి మరియొకమార్గమున సింధులోని ఎడారిమార్గములంబట్టి పలాయనము సాగించెను ఆతని యాస్థాన చరిత్రకారుని కథనమున మహమ్మదు "థక్కా" నుండి గజనీకి వెళ్ళినదారినిగాక, చుట్టుతిరిగి యొకమార్గదర్శకుని సాయమున జేరవలసివచ్చినది దానికి కారణము హిందూరాజయిన పరమదేవుడు వెంబడించుటయే మార్గమధ్యమున నెన్నియో గుఱ్ఱములు ఎంగరో భటులుమరణించిరి. ఎన్నియో కడగండ్లనెదుర్కొనవలసివచ్చినది" పరమదేవుడు పరమరాజు భోజరాజే ముస్లిముచరిత్రకారులు భోజుడు మహమ్మదు నెదుర్కొనినట్లు వ్రాయకపోయినను భోజుని ఉదయపుర ప్రశస్తి, అతడు తురుష్కుల జయించినట్లు పేర్కొనుచున్నది లేనిచో మహమ్మదు వచ్చినదారినిపోక ఎడార్తిలో నానాబాధలు పడనవసరములేదు

ఇస్లాము మతమునందు 'దేవుడొక్కడే' మహమ్మదతని "ప్రవక్త" యను స్తోత్రము ముఖ్యము ఈశ్వరుడు విశ్వపితయయిన, ఆతని భక్తులందరు సోదరులే. ఏకేశ్వరోపాసన ఇస్లాము మతానుయాయుల సౌభ్రాత్రమునకు దారితీసినది. గజనీమహమ్మదు దండయాత్ర విరమించుకొని గజనీకి తరలిపోయినను ఇస్లాము మతసంపర్కము హైందవభూమిని మరికొన్ని సమస్యలను రేకెత్తించెను

విగ్రహారాధకులకు బుద్ధిచెప్పుటకు వారిసొత్తు కొల్లగొట్టుటకు ఇస్లాము ధ్వజము ప్రతిష్టించి దేవునకు, ప్రవక్తకు సంతోషము విగ్రహారాధకులకు విముక్తికలిగించుటకు మరల మహమ్మదువంటివాడెవ్వడో తలయెత్తవచ్చును. గోరీమహమ్మదు క్రీ॥శ 1192 లో స్థానేశ్వరయుద్ధములో పృథ్వీరాజును జయించి అజ్మీరు రాజ్యమును ఆక్రమించెను. క్రీ॥శ॥ 1197 సంవత్సరమున నతని సేనాని విశ్వవిఖ్యాతిగన్న నాలందా విశ్వవిద్యాలయమును అందలి రత్నోదధి రత్నగర్భ పుస్తక భాండాగారములను విధ్వస్తమొనరించెను. క్రీ॥శ॥ 1199లో పద్మావతీ చరణచారణ చక్రవర్తి జయదేవకవికి ఆశ్రయమిచ్చిన లక్షణసేనప్రభువును పార ద్రోలి వంగదేశము నాక్రమించెను కొలది కాలములో నుత్తరాపథమంతయు ముస్లిముసంస్కృతికి ప్రభుత్వమునకు దోసిలొగ్గినది.

ఉత్తరాపథముదాటి దక్షిణాపథమునగూడ ఇస్లాముసంస్కృతి ముస్లిము దండయాత్ర మురచివేయకుండ అరికట్టుట అవశ్యకర్తవ్యమయ్యెను. హిందూ మతము ఆనాడు కులభేదములతో బహుదేవతోపాసనతో నిండియుండెను. అంత శూద్రములు సహజరాజకీయ జీవితమునత్రుట్టుచుండెను. ఇట్టితరి శైవులు ప్రబలి ఏకేశ్వరోపాసన ప్రతిపాదించి కులభేదములకు స్వస్తిపలికిరి. శివుడు పరమ దైవము శివుడు విశ్వపిత శివభక్తులందరు సోదరసమానులు కులభేదములకు తావులేదు. పండితారాధ్యునివంటి మహాపురుషుడానాడు—

"భక్తిమీదివలపు బ్రాహ్మ్యమ్ముతో పొత్తు వదలలేను నేను బసవలింగ" అని చెప్పెను శైవులలో నతివాదమును ప్రబోధించినాడు బసవేశ్వరుడు. ముస్లిము సంస్కృతి వింధ్యపర్వతపంక్తులు దాటిరాకుండ "హరహరమహదేవ్ అశ్శరభ శరభ" అని వీరావేశమున శివమెత్తి త్రిశూల ఖడ్గధారులై ప్రతిఘటించి నిల్చిన కీర్తి వీరశైవులకు దక్కినది. వీరశైవులు సాంఘిక రాజకీయరంగములననేక ప్రయోజనములు సాధింపనిల్చిన మహోద్యమప్రవర్తకులు. అందుచే వారు నన్నయ భారతమును స్పృశింపలేదు వారు బ్రాహ్మణపారమ్యము-సంస్కృతాధిక్యము-వర్ణాశ్రమ ధర్మములు-వైదిక సంస్కృతినంగీకరింపరు. అపుడు దేశమునకుగావలసినది వీరశైవ ప్రబోధముగాని భారతాంధ్రీకరణముగాదు శివకవులు నన్నయ సంస్కృతభూయిష్ఠరచన నేవగించుకొనుటయేగాక "బ్రాహ్మణగార్ధభములు", "అద్వైతగాడిద"లని దుమ్మెత్తిపోసినారు.

ఆనాడు ప్రగతిశీలురందరు శైవులే. ఆ మహోద్యమమునకు దమజీవి

శమును శ్రుతిగల్పుకొనిరి. దక్షిణాపథమున కాకతీయసామ్రాజ్యము శైవులు నిర్మించినదే. ఆనాటి చంపుడు గుడులనుబట్టి పరమేశ్వరారాధనకై యెందఱు వీరశైవులు తమ శిరస్సులను చేతులార గండకత్తెరకు బలిదానముగ సమర్పించెడువారో తెలియనగును మతసంరక్షణమునకు ప్రాణము తృణప్రాయము అది యుగధర్మము. కాలమాహాత్మ్యము

తిక్కనగూడ శౌలనాళ్ళలో శైవుడే శైవుల ప్రాణబలిదానముకైన సంసిద్ధమగు త్యాగశీలము ప్రతికూలసభ్యతపై, ప్రతికూలశక్తులపై విరోధిసేనలపై జరపిన మంచిదే. కాని సుస్థిర సామ్రాజ్యస్థాపనముతో నాయావేశము నంతశ్ఛిద్రముగా పరిణమించినది.

శివపారమ్యమునంగీకరింపక వీరశైవుల వీరావేశము నెదుర్కొనినవారు వైష్ణవులు. దక్షిణాపథమున నీయుభయమతానుయాయులు కత్తుకలు దరుగు కొనుటకుద్యమించినారు. జాతీయశక్తి - అంతఃకలహములతో అన్యోన్యమారణహోమముగా మారసాగినది తిక్కనమహాకవి ఈ అన్యోన్య కలహోన్మాదమును గాంచి అశ్రువులురాల్చినాడు. నిర్మాణాత్మకమైన కృషిసలుపవలసిన మహాశక్తి వ్యర్థమైపోవుచున్నది ఆలసించుటకిది తరుణముగాదు. తాను శైవుడే. అయిన నేమిః ఆంధ్రావని నుద్ధరించుటకై

శ్రీయన గౌరినాఁబరఁగు చెల్వకుఁజిత్తము పల్లవింప భ
ద్రాయతమూర్తియై హరిహరంబగు రూపముదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడుభక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చు పరతత్త్వముగొల్చెద నిష్టసిద్ధికిన్

అని ఎలుగెత్తి చాటగల్గినాడు ఇది శివకేశవాభేదాత్మకమైన ధర్మాద్వైతము. మతోన్మాదమునెదిర్చి గాంధీమహాత్ముడు "ఈశ్వరఅల్లా తేరేనామ్" అని అన్న మాట "విష్ణురూపాయ నమశ్శివాయ" అని తిక్కన అన్నమాటకు కాలానుగుణమైన స్వేచ్ఛానువాదమే.

ఆంధ్ర సాంఘిక జీవితమును నిత్యరణక్షేత్రమొనర్చి జాతీయశక్తి నంతను వమ్మొనరించుచున్న శైవ వైష్ణవ విభేదములకు స్వస్తిచెప్పి హరిహరనాథోపాసన, శివ కేశవాద్వైతము ప్రతిపాదించు "విష్ణురూపాయ నమశ్శివాయ" యని యుభయమతములకు మధ్యనిలిచి పొత్తుకుదిర్చి, నవ్య యుగోదయమున ఉషస్సూక్తము పఠించిన రాయబారిమాత్రమేగాదు తిక్కన —

జాతీయజీవితమును నిత్య కురుక్షేత్రమొనర్చు విప్రతిపన్న శక్తులకు శాశ్వతసను న్వయము; వేదాంతము ప్రతిపాదింపనిలిచిన జ్యోతిర్మూర్తియైన "ధర్మాద్వైత మూర్తి". మహాభారతము ఈ ధర్మాద్వైతమునే ప్రబోధించుచున్నదని తిక్కన యుద్దేశము. తెలుగుజాతికి ఈ మహాప్రబోధ మందించుటకే "ఆంధ్రావళి మోద ముంబొరయ" తిక్కన ఆంధ్ర మహాభారతమును "మహాకవిత్వదీక్షావిధి" నొంది రచింతునని చెప్పుకొనెను.

విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుడు సంయమి ప్రకరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁడర్థిలోక హితనిష్ఠన్‌బూని కావించె ధ
ర్మాద్వైతస్థితిభారతాఖ్యమగు శేఖ్యంబైన యామ్నాయమున్.

భారతరచనకు తిక్కనమహాకవికి భవ్యకవితావేశము కల్పించినది ఈ ధర్మాద్వైతనిరూపణమే.

"వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైనచోటులను దా
మూదల ధర్మార్థ కామమోక్షస్థితికిన్"

అని తిక్కన ప్రవచించెను.

ధర్మము ద్వైతమగునా? ఇక ధర్మాద్వైతమననేమి? వేదములు ఉపనిషత్తులు బహుధర్మ ప్రతిపాదకములు. ధర్మసూక్ష్మము తెలిసికొనుట కష్టము. అపుడు లోకమునకు గతియేమి. "సత్యంవద" "అహింసాపరమోధర్మః"—ఇత్యాది ధర్మములు వేదోపనిషత్ప్రోక్తములు అహింసాధర్మము పాటించినపుడు సత్య వ్రతమునకు భంగమేర్పడవచ్చును. అపుడు పంచమవేదమైన భారతమే మార్గ దర్శకమని తిక్కనమహాకవి సందేశము

ఒక అరణ్యము-అందొక ఋషికులము-అరణ్యమార్గమునబోవు గృహస్థుని సంహరించి ధనము నపహరింప దొంగలు వెంటాడుదురు. గృహస్థు ఆ యా శ్రమమందలి ఋషి మరుగుచేరును. వెంబడించిన దొంగలు ఆ గృహస్థుని ఉనికి పట్టులగూర్చి ఋషిని ప్రశ్నించెదరు. "సత్యంవద" అన్న వేదవాక్యమును పాటించిన "అహింసాపరమోధర్మః" అను ఉపనిషద్వాక్యమునకు భంజక మగును. ఋషి కర్తవ్యమేమి? ఇట ధర్మము ద్వైతముగా నున్నది. కాని ధర్మా ద్వైతపరిష్కారము పంచమవేదము సూచించుచున్నది.

భూతహితంబుగాఁబలుకు బొంకును సత్యఫలంబునిచ్చుతల్
భూతభయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్ల ప్రా
ణాతురుడైనచో పరిణయంబునయందున బల్కు బొంకు స
త్యాతిశయంబయండ్రు మహితాత్మక! ఇట్టివి ధర్మసూక్ష్మముల్.

రెండు ధర్మములు విప్రతిపన్నములై యున్నపుడు దేనిననుసరింపవలెను. ధర్మమొకటియేగదా! అందేది "పరమధర్మమో" దానిని అనుసరింపవలెను. స్వార్థమును కుటుంబముకొఱకై, కుటుంబమును సంఘముకొరకై, సంఘమును దేశముకొరకై, దేశమును విశ్వముకొఱకై, విశ్వమునుసత్యముకొఱకై త్యజింపవల యును. ఈ త్యాగమే పరమధర్మము. చిన్న ధర్మమును పెద్దధర్మమునకై త్యజిం చుటయే ధర్మాద్వైతము. ఏదియో యొక ధర్మముచేయుటగాని, ఏధర్మమును స్వీకరింపక యుపేక్షించుటగాని కర్తవ్యముగాదు

కేవలనిష్కర్మత మో
క్షావహమగునేని గిరులు నవనీజములున్
భూవర! ముక్తిం బడయం
గావలవదె? యదవినునికి కైవల్యదమే?

తిక్కనమహాకవి మానవుడు కర్మవీరుడై జీవితరణక్షేత్రమున వీరుడుగావలెనని యుద్బోధించెను కర్మసన్యాసమునకు విపరీతార్థము ప్రవచించి కేవలసన్యాసమే మోక్షావహమని భారతమాదేశింపలేదు. జీవితమునందుండి మానవుడు ముక్తుడు గావలయును. జీవితమునుండి తరించుటకు మార్గము జీవితమే-కర్మయోగమే-కర్మవీరతయే

ఫలములయెడ బ్రహ్మార్పణ
కలనపరుండగుచు కార్యకర్మమునడపన్
వలయుం తత్త్వజ్ఞానము
దలకొనిం గర్మశమము దానైకలుగున్" అని తిక్కన సందేశము

తిక్కన మహాభారతము చేబట్టుటకు కారణము మహాభారత వేదాంతము-అతని జీవితము వేదాంతములో సంగమించుటయే. తిక్కన మానవజాతికందింపఁ దలపోసిన ధర్మాద్వైతమునే భారతము ప్రబోధించుచున్నది అందుచే రెండు శతాబ్దులు నిల్చియున్న మహాభారతమును తిక్కనమహాకవి తిరిగి చేపట్టుట కేవ

లము యాదృచ్ఛికముగాదు తిక్కన సమకాలీన జగత్తునకు విశ్వమానవలోకము నకు అందింపఁదలపోసిన వేదాంతమే అందిమిడియున్నది.

తిక్కన అనుష్ఠానవేదాంతి. తెలుగుజాతి క్రియాశూరులై కర్మవీరులు కావలెను. అదియే మానవపరమధ్యేయము. అనుష్ఠానపరమైనకర్మయోగమే ధ్యేయమైన నేది యాచరణీయమో ముందు తెలిసికొనవలయును మానవుడు తొలుత జ్ఞానియై, తత్త్వజ్ఞానము నలవరచుకొని విప్రతిపన్నములైన ధర్మములమధ్య పరమధర్మమునేరుకొని అనుష్ఠింపవలెను. జ్ఞానము వెనువెంట కర్మానుష్ఠానము. ఈ అనుష్ఠానముమాత్రము బ్రహ్మార్పణబుద్ధితో, అహంకారత్యాగముతో సలుపవలెను. తిక్కన సందేశమున కర్మాచరణమే యోగసాధన. జీవితమే కురుక్షేత్రము. కురుక్షేత్రము ధర్మక్షేత్రము. సంకుల ధర్మసమరక్షేత్రము.

ఈ ధర్మాద్వైతమును ఒకనాడు వేదవ్యాసమహర్షి భారతవర్షమున ఎలుఁగెత్తి చాటినాడు. అందుచే భారతవర్షము కర్మభూమి-పుణ్యభూమియని ప్రసిద్ధినొందినది. తరువాత అపరవేదవ్యాసుడు తిక్కనమహాకవి తెలుగుభూమిలో ధర్మాద్వైత ప్రతిష్ఠాపకుడయ్యెను. అందుచే దేశభాషలలో నెక్కడలేని ప్రాధాన్యము-ప్రతిష్ఠ తెలుగుభాష సంపాదించుకొనగలిగినది. భారతదేశ జాతీయ గ్రంథము భారతము. భారతధర్మము నవగతమొనర్చుకొనిన కవిత్రయము వారి చేతిలో తెలుగుభారతముపడుట తెలుగువారి యదృష్టము. తెలుగుభూమిలోకూడ జాతీయగ్రంథము భారతమే.

ఈ ధర్మాద్వైతమును-ఈ సమన్వయ వేదాంతప్రబోధము ఆంధ్రభూమిలోనుండి-ఆంధ్ర వాఙ్మయములోనుండి వెలువడుటలో మిక్కిలి ఔచిత్యమున్నది. తెలుగుదేశము భారతవర్షములో నడిబొడ్డున నున్నది. ఔత్తరాహుల హృదయము, దాక్షిణాత్యుల మెదడు-అటు ఆవేశము-ఇటు ఆలోచన, అటు భావావేగము-ఇటు క్రియాశూరత తెలుగునాట సంగమించుచున్నవి. ఈ మహాకవి ఆదర్శాంధ్రుడు. తెలుగుదనము మూర్తీభవించిన మహాకవి. అటు హరిహరనాథోపాసనముచే భక్తిని, ఇటు భగవద్గీతాపరమైన భారతరచనతో ధర్మాద్వైతమూలకమైన అనుష్ఠాన వేదాంతమును ప్రబోధించిన భక్తుడు; కర్మవీరుడు.

"ఆంధ్రావళి మోదముంబొరయ మహాకవిత్వ దీక్షావిధి"-"నానేర్చినభంగి చెప్పి వరణీయుడనయ్యెద భక్తకోటికిన్"-"ధర్మాద్వైతస్థితి"-"ఆరాధనావిశే

షము" మున్నగు ప్రయోగములు విశేషార్థవంతములు. తిక్కన ఆత్మీయతా దీపకములు.

తన పూరి గుడిసెనుగూడ మహాప్రాసాదముగనే స్వీకరించి సంతృప్తిని చెందగల వైరాగ్యసంపన్నుడు మహానుభావుడు పోతన. తన మహా ప్రాసాదమునుగూడ పూరిగుడిసెయట్లులే భావింపగల సమబుద్ధిభూషితుడు మహామహితాత్ముడు తిక్కన.

తిక్కన మహాయోగిగనుక ఆతనిని మహాకవిగా గౌరవింపవలెనని చెప్పుటగాదు. తిక్కన ప్రధానముగాఁగవి. వేదాంతమతని కవితాస్రవంతికి అంతర్వాహినిమాత్రమే. అందుచే తిక్కన భారతమును "ప్రబంధమండలి"గా రచించెను. భగవద్గీతాసారమును విడువకుండ చెప్పినను యథాక్షరానువాదమును సలుపలేదు. వేదాంతముగూడ కాంతాసమ్మితముగా మహాభారతమునఁ జెప్పి తిక్కన పురుషార్థముల కర్థవివరణసల్పిన మహాకవియయ్యెను.

తిక్కన విదురునినోట తాదాత్మ్యసిద్ధితో పలికించిన పలుకులు చిరస్మరణీయములు.

మాలకరి పుష్పములు గోయుమాడ్కి తేటి
పువ్వు దేనియఁ గొనియెడుపోల్కి నెదురఁ
గంద కుండగ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁబోలె మొదలంట బొడవజనదు.

పరుల ధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియగ నసహస్యపడు న
న్నరుడు తెవులులేని వేదనంబడు నధిపా.

ధనమును విద్యయు వంశం
బును దుర్మతులకు మదంబుఁబొనరించును స
జ్జనులైన వారి కడకువ
యును వినయము నవియ తెచ్చు నుర్వీనాథా!

క్షమియించువారి గని బా
లమి వెట్టుదురైననుందలంప ననూన
క్షమయ కడల మెఱయు తొడవు
త్తమరూపము గోరువారు దాల్తురు దానిన్.

చెల్లియుండియు సైరణచేయునతడు
బీదవడియును నర్థికి బ్రియముతోడ
దసకుఁగల భంగి నిచ్చునతండు బుణ్య
పురుషుడనిచెప్పిరార్యులు గురువరేణ్య.

నన్నయకూడ "మితహిత సత్యవాక్య"మని ప్రశంసించి "వాక్పారుష్యము చన్నె మహాదారుణ మతి విషముకంటె దహనముకంటెన్," అని ధర్మరాజు నోటఁబలికించెను. ఎదిరి కందకుండగ, పూదేనెను తేటి గ్రైకొనునట్లు కర్తవ్యమును నెరవేర్చుకొనవలెనని తిక్కన యుద్బోధించెను. ఇంతటి తియ్యని గుండెలనుండి స్రవించుటచేతనే నన్నయ తిక్కనల వాణి యుగయుగాంతరములు తేనెసోనల నొలుకగలుగుచున్నది.

# తెలుగుకవులు

కవులకంటె తుహిన కర్పూర నిభకీర్తి
తెచ్చిరెవరు నీకు తెలుగు తల్లి!
సాహితీ తరంగ సంగీత రసధుని!
దేశ భాషలందు తెలుగు లెస్స—"తారాతోరణము."

తెలుగుకవులకు జరిగిన సత్కార గౌరవ ప్రపత్తులు ప్రపంచమున ఏదేశ చరిత్రలోను మరే భాషాకవులకును జరుగలేదు. ఆంధ్రదేశము కవులకు పుట్టినిల్లు. ఆంధ్రులు కవితారసికులు. కవిపోషకులు. ఆంధ్రదేశమున నుద్భవించిన తొలి కావ్యముగా పేర్కొనదగినది "గాథాసప్తశతి" ప్రాకృతభాషలోనిది. ఆ సప్తశత ముక్తకములను ఏర్చికూర్చిన మహాకవి శాతవాహన చక్రవర్తి హాలుడే. కుంతల శాతకర్ణి ఉజ్జయిని జయించి కాళిదాస మహాకవిని ఆంధ్రరాజధానియగు ప్రతిష్ఠానమున తన ఆస్థానకవిగా ప్రతిష్ఠించినాడు.

ఆంధ్రకవితారాధన చాళుక్య సమ్రాట్టులు ఆరంభించినారు. గుణగ విజయాదిత్యుని సేనాని-జగదేకవీరుడు-కందుకూరి సీమ పరిపాలకుడు పండరంగ సేనాని అద్దంకిశాసనములో తెలుగు పద్యములు-(తరువోజలు)-ప్రప్రథమమున కన్పించుచున్నవి. ఆంధ్రచరిత్రలో ప్రప్రథమ "సాహితీసమరాంగణ సార్వభౌముడు" చాళుక్యసేనాని పండరంగడు. అద్దంకిశాసన రచయితయైన ఆ మహాకవి కందుకూరు పాలకుడైన జగదేకవీరుని మిత్రుడు అప్తుడు

ఆంధ్ర సారస్వతమున ప్రాతఃస్మరణీయులు శ్రీమదాంధ్ర మహాభారత రచయితలైన కవిత్రయము – నన్నయ–తిక్కన–ఎఱ్ఱన మహాకవులు. రాజరాజ నరేంద్రుని ఆస్థానకవి నన్నయభట్టు. అయినను ఆ మహాకవిని చాళుక్యచక్రవర్తి రాజరాజు ఆశ్రితుడుగాచూడలేదు. నన్నయమాటలలో చెప్పవలెననిన రాజరాజ నరేంద్రుడు

"తన కుల బ్రాహ్మణు ననురక్తు నవిరళ జపహోమ తత్పరుడైన" నన్నయను భారతమును వ్రాయమని కోరినాడు. ఆదికవి నన్నయ, రాజరాజ నరేంద్రునకు అనురక్తుడే గాని ఆశ్రితుడుగాడు. అంతేగాక—

"పాత్రు ఆపస్తంభసూత్రు" అని నన్నయ చెప్పుకొనియున్నాడు. నన్నయ రాజరాజనరేంద్రుని ఆస్థానమున వెలసిన సంధివిగ్రహపాత్రుడు. సంధి విగ్రహపాత్రులు అనగా రాయబారులు అన్నమాట. రాజునకు అనురక్తులై 'లోకజ్ఞు'లైన వారు మంత్రులలో సమున్నతులు చాలమంది తెలుగువారిలో నన్నయభట్టు కేవలము కవియని తిక్కన మహామంత్రియని ఒక అభిప్రాయము వ్యాపించియున్నది. నన్నయ తాను 'లోకజ్ఞు'డననియు 'పాత్రుడ'ననియు కంఠో క్తిగ చాటిచెప్పుకొనియున్నాడు తిక్కనవలెనే నన్నయగూడ లోకజ్ఞుడైన మంత్రి వరేణ్యుడు.

తిక్కనమహాకవి మనుమసిద్ధి ఆస్థానమున కులక్రమానుగతమైన మంత్రి పదవిలో నున్నవాడు మనుమసిద్ధి మహారాజునకు తిక్కన తన తొలికావ్యము నిర్వచనోత్తరరామాయణమును అంకితమిచ్చియున్నాడు. దానికికారణము ఆశ్రితు డైన కవి ఆశ్రయప్రదాతయైన మహారాజునకు స్వామిభక్తి పరాయణత్వముతో సమర్పించు కానుకగా తన కవితాకృతిని అంకితమిచ్చుటగాదు. మహారాజు తన్ను 'మామా'యని పిల్చెడివాడట! అందుచే సంతోషించి ఆ మహాకవి తన కవితా కన్యను అంకితమిచ్చినట్లు తిక్కన చెప్పుకొనినాడు. తెలుగుకవికి ఎంతటి ఆత్మ ప్రత్యయము! ఆ ఆత్మగౌరవము తెలుగుకవులకు తెలుగుచరిత్రలో చెల్లుబడియగు చున్నది.

తెలుగు కవీశ్వరుల జన్మ ధన్యము. అంకితమిచ్చు ఆచారము-ఆంధ్ర సారస్వతమున అనూచానముగా వచ్చుచున్న సారస్వత సంప్రదాయము. కృతి కర్త-కృతిభర్త సంబంధము పరమ పవిత్రమైనది. కావ్యము విశ్వశ్రేయమైనది కవితారచన జగద్ధితమైనది అందుచే కర్త కారయితకూడ ధన్యులే

తిక్కనమహాకవి. మహామంత్రి. తన ఏలికయైన మనుమసిద్ధిమహారాజు విధి విపర్యయమున పదచ్యుతుడైనపుడు, తిక్కనమహాకవి కాకతి గణపతిదేవుని కడకేగి ఆ చక్రవర్తిని మెప్పించి రాయబారము నెరపి-తన ప్రభువుపక్షమున కాకతీయసైన్యమును రప్పించినాడు. మనుమసిద్ధిమహారాజుకు కాకతీయసైన్య. సాహాయ్యముచే సింహాసనము తిరిగి సిద్ధించినది.

ఆంధ్రకవులు ఆంధ్రచరిత్రలో నిర్వహించిన భూమిక అద్వితీయము ఆట్లే ఎఱ్ఱాప్రెగ్గడమహాకవి నిర్వహించిన భూమిక నిరుపమానమైనది.

ఎఱ్ఱన-ఆంధ్రదేశచరిత్ర వింతమలుపు తిరిగిన రోజులలో నున్నవాడు. ఆంధ్రులు చరిత్రోదయమునుండి-క్రీ॥పూ॥ 800 సంవత్సరములనుండి పదునారు శతాబ్దులు క్రీ॥శ॥ 1323 వరకు స్వరాజ్యము, స్వాతంత్ర్యము అనుభవించి పరాధీనత ఎరుగనివారు. క్రీ॥శ॥ 1323 ఓరుగల్లు పతనము. అపుడు ఉలూఘ్‌ఖాన్ (= మహమ్మద్ బీన్ తుగ్లక్) కాకతీయ ప్రభువైన ప్రతాపరుద్ర చక్రవర్తిని బంధీకృతుని గావించి ఢిల్లీకి పంపించెను మార్గమధ్యమున ఆత్మాభిమాన దురంధరుఁడైన ఆ కాకతీయ చక్రవర్తి - పడవపై నర్మదానదిని దాటుచున్నపుడు ఆత్మహత్య చేసికొనినట్లు తెలియుచున్నది.

అపుడు అరాచకమైన దేశము తురుష్కాక్రాంతమై పదరానిపాట్లు పడినది. పరాభవముతోపాటు తుష్టకుపరిపాలన. ఓరుగల్లు పతనమునకు ఎఱ్ఱన వయస్సు సుమారు 25 ఏండ్లుండును. నవయువకుడైన ఎఱ్ఱనమహాకవి మనస్సులో ఆ అరాజకస్థితి "ప్రగాఢముద్ర" వేసినది. అతని భారతమున అరణ్యపర్వములో కలియుగ ప్రభావము వర్ణింపబడినది. కలియుగ ప్రభావమును కన్నులార గాంచిన కవీశ్వరుడు ఈ పృథివిలో ఒక్కఁడున్నచో అతడు ఎఱ్ఱాప్రెగ్గడ. ధర్మరాజునకు మార్కండేయుడు కలియుగ ధర్మంబులు చెప్పుచో

వివిధ వ్యాఘ్ర మృగోరగాకులములై విస్తీర్ణ శూన్యాటవీ
నివహాభీలములై యరాజకములై నిర్మూలధర్మంబులై
ద్రవిళాభీర తురుష్క బర్బర పుళింద వ్యాప్తి దుష్టంబులై
భువిలో నెల్లెడ పొడగున్ జనపదంబుల్ తద్యుగాంతంబునన్.

సంస్కృత భారతమున 'తురుష్కవ్యాప్తి' లేదని వేరుగ చెప్పనక్కరలేదు. మూలభారతమున "ఆంధ్రులు" గూడ బర్బర పుళిందాదులతో కలిసియున్నారు. ఎఱ్ఱన సహజాంధ్రాభిమానముతో ఆంధ్రులను వదలి తురుష్కులను కలిపినాడు. ఎఱ్ఱన అప్పట్టున వ్రాసిన వాక్యములు మిక్కిలి అర్థవంతములు.

"వేదనిందసేయుచు"-"అరులు మిగులఁగొని రాజులు నరులకు నెంతయు భయమొనర్తురు"- "అన్యోన్యపీడ" - "ద్రవిణహీనులై దాతయొక్కఁడు లేక ఎరిగెడు వారును నెంతయు క్రూరులై చేసినపాపంబు చేసెదరు చూవె" "పుడమి సమస్తంబు నరక భూయిష్ఠ మగున్," "సుహృజ్జన మాతా పితృహంతలు", "యదృచ్ఛాకర్మ శీలుర్ ధరన్ జనసంఘాజితులై చరించెదరు"," దేవతాయతనం

బులు జగతీసురావసథంబులుం బావనాశ్రమ భూములుం జెడి పాడగున్"

కానీ-ఆ అరాజకస్థితి ఎంతోకాలము ఆంధ్రదేశమున కొనసాగలేదు. ఆంధ్ర వీరులు దేశభక్తి ప్రపూరితులై-స్వరాజ్యము-స్వాతంత్ర్యము-సనాతన సంస్కృతి పునఃప్రతిష్ఠించుటకై ఒక బ్రహ్మాండమైన మహోద్యమము లేవదీసినారు. దానికి పూర్వాంధ్రమున నాయకత్వము వహించినది ముసునూరి ప్రోలయ నాయకుడు-కాపయనాయకుడు-మరియు ప్రోలయ వేమారెడ్డి, అతని అనుజుడు మల్లారెడ్డి. ఎఱ్ఱాప్రెగ్గడ-విద్యారణ్యస్వామి సమకాలీనులు.

మల్లారెడ్డి ఎఱ్ఱాప్రెగ్గడకు మిత్రుడు. అద్దంకిరాజైన ప్రోలయ వేమారెడ్డికి అనుగు సోదరుడు. మహారాజైన వేమారెడ్డికి జగదేకవీరుడైన తమ్ముడు సమర్పించిన కానుకగా ఎఱ్ఱన, రెడ్డిరాజుల ఆస్థానకవియైనాడు.

మల్లారెడ్డి పేరు - ఆంధ్రదేశచరిత్రలో ఆంధ్రసాహిత్యచరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపఁదగినది. ఆంధ్రదేశము ఆ మహావీరుని పేరు మరచిపోవుట మిక్కిలి శోచనీయము. శ్రీకృష్ణదేవరాయలకు విజయనగరసామ్రాజ్య నిర్మాణమునకు పూర్వరంగ ప్రవర్తకుడు మల్లారెడ్డి. మహారాజైన వేమారెడ్డి మాటలుగా ఎఱ్ఱనవ్రాసిన పద్యము ఇచ్చట అనుసంధేయము.

నా తమ్ముండు ఘనుండు మల్లరథినీనాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుజేసి యెలమింజేపట్టి మాకిచ్చుటం
జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతింబొందితి నింక నేను దనియన్గాక్షివ్యామృతాస్వాదనన్.

ఎఱ్ఱన వ్రాసినట్టి ఆరామాయణము ఇపుడు ఆంధ్రదేశమున ఉపలభ్యమానము గాదు. ఆ రామాయణములేని కొఱత తీర్చరానిదని వాపోవు రసజ్ఞులున్నారు. నిజమే. ఎఱ్ఱన రామాయణములో మల్లారెడ్డి చరిత్ర కొంత ఉండియుండును. ఆ చరిత్ర నేడు మృగ్యమగుట ఆంధ్రుల దౌర్భాగ్యము. అయినను మల్లారెడ్డి సాధించిన ఘనవిజయములు చరిత్రకు తెలియకపోలేదు. తెలిసినవి చాలును-అతనిని ఆంధ్రదేశ చరిత్రలో ఆంధ్రసారస్వత చరిత్రలో ఆచంద్రార్కమైన కీర్తి ప్రతిష్ఠించుటకు. ఎఱ్ఱన హరివంశములో మల్లారెడ్డిని గూర్చి వ్రాసిన పద్యముదాహరింపదగినది.

బాహాదర్పమునన్ బ్రతీప ధరణీపాలావలిం దోలి యు
త్సాహోదగ్రుడు మోటుపల్లి గొని సప్తద్వీపసద్వస్తు సం
దోహంబున్ దనకిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతిగావించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీనాథుండు గాఢోద్ధతిన్

మల్లారెడ్డికి నెచ్చెలి సముద్రుడట అసలు నెచ్చెలి అతనికి ఎర్రాప్రెగ్గడ కవి తెలుగుకవులు చరిత్రలో నిర్వహించినపాత్రకు జేజేలు-మల్లారెడ్డికి జేజేలు-ఆంధ్ర సంస్కృతికి జేజేలు! మల్లారెడ్డి పెట్టిన ఒరవడి తరువాతి రెడ్డిరాజులకు మాత్రమేగాక విజయనగర సామ్రాజ్య చక్రవర్తులకుగూడ ఆదర్శప్రాయమైనది.

శ్రీనాథుడు రెడ్డిరాజుల ఆస్థానకవి. విద్యాధికారి. రెడ్డిరాజులకే గాక ఆనాడు శ్రీనాథకవిని సమకాలీనసంఘము ఆదరించిన విధానము చదివినచో ఏ దేశమందలి సహృదయులైనను పులకరించక తప్పదు

రంభగూడె దెలుంగురాయ రాహుత్తుండు
  కస్తూరి కే రాజు ప్రస్తుతింతు?
కాశికావిశ్వేశు గలిసె వీరారెడ్డి
  రత్నాంబరమ్ము లే రాయడిచ్చు?
కైలాసగిరి బంట మైలారు విభుడుండె
  దినవెచ్చ మే రాజు తీర్పగలడు?
స్వర్గస్థుడయ్యె విస్సనమంత్రి మరి హేమ
  పాత్రాన్న మెవ్వని పంక్తి గలదు?
భాస్కరుడు మున్నె దేవుని పాలి కరిగె,
కలి యుగంబున నిక నుండ కష్టమనుచు
దివిజ కవి వరు గుండియల్ దిగ్గురనగ
నరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి

రత్నాంబరాలతో కస్తూరి ఘనసార కర్పూర తాంబూలాలతో హేమపాత్రాన్నములతో కవీశ్వరులను సత్కరించిన సన్నివేశములు ఏదేశచరిత్రలో ఉన్నవి?

శ్రీనాథునకు ప్రౌఢదేవరాయల ముత్యాల శాలలో దీనారటంకాలతో కనకాభిషేకము జరిగిన సంగతి సుప్రసిద్ధము అతడు గౌడడిండిమ భట్టును జయించి అతని కంచుఢక్కను పగులగొట్టించిన విద్వత్కవిసార్వభౌముడు. మరణ

శయ్యపైగూడ ఆంధ్రకవి ఆత్మప్రత్యయము ఉగ్గడింపదగినది

ఆంధ్రకవి అమరలోకమునకు వేంచేసిన తక్షణమే, అచటి ఆస్థానకవి పాపము! తన పీఠము దిగిపోవలసిననే అది ఆంధ్రకవికి ఆంధ్రదేశములో నున్న ప్రతిపత్తి

శ్రీనాథునకు సత్కారము చేసినది రాజులు మంత్రులు మాత్రమేగాదు. సముద్రాంతర వర్తకముచేసి సుప్రసిద్ధుడైన అవచి తిప్పయ్యసెట్టికూడ అతనిని ఆదరించి హరవిలాసమునకు కృతిభర్తయైనాడు.

యావదాంధ్ర సంఘములో-రాజులు సామంతులు-మంత్రులు పౌరులలో సహృదయత అజన్మ సిద్ధముగా వర్థిల్లుట గమనింపఁదగిన విశేషము.

రెడ్డిరాజుల ఆస్థానకవియైన శ్రీనాథుఁడు రెండుసార్లు శత్రురాజ్యమున కేగవలసి వచ్చినది. అవి వెలమరాజ్యములు వెలమవీరుల వ్యక్తిగత పరాక్రమ సాహసములు తెలుగువారికి అనుభవ పునరుక్తములు దేవరకొండ ప్రభువైన లింగమనీడు కొండవీడుపై దండెత్తి విజయాంకముగా రెడ్డిరాజన్యులు ధరించు కత్తిని గొనిపోయెనని కథ ఆ కత్తిపేరు 'నందికంత పోతురాజు కటారి'. ఆ 'బాకు' రెడ్డిరాజ్య పౌరుష లాంఛనము. ఆ కటారి, కిరీటముకంటె ఆ రాజులకు ప్రియమైనదని లోకప్రతీతి. అందుచే పెదకోమటి వేమారెడ్డి శ్రీనాథుని దేవర కొండకేగి ఆ కటారిని ఎట్లైన తెచ్చి పెట్టవలెనని ఆంతరంగికముగా అర్థించెనని చెప్పుదురు అది దండయాత్రవలన సిద్ధించునదికాదు. శ్రీనాథకవి లింగమనీని ఆస్థానమున కేగినాడు. విద్వత్కవి సార్వభౌముఁడైన శ్రీనాథుని ఆరాజు మెచ్చి కొని వరము కోరుకొనమనెను కవి పోతరాజు కటారిని అర్థించినాడు. లింగమ నీఁడు కవిరాజునకు కటారి కానుకగా ఇచ్చినాడు. 'అదృష్టచిహ్నము'గా 'శౌర్య లాంఛనము'గా రెడ్డిరాజన్యులు మురిసిపోయిన 'కటారి' వారికి ఆస్థానకవి చాతుర్యము వలన సిద్ధించినది కథ కంచికి వెళ్ళనిండు. తెలుగు చరిత్రలో కవులు నిర్వహించిన పాత్రకు జేజేలు!

రెండవసారి శ్రీనాథుఁడు రాచకొండ ప్రభువైన సర్వజ్ఞ సింగభూపాలుని కొలువున కేగవలసి వచ్చినది. వెలమరాజులకు, రాజమహేంద్రవర రెడ్డి రాజులను బద్ధవైరము. శత్రు రాజాస్థానకవి శ్రీనాథుడు వచ్చినప్పుడు సర్వజ్ఞ సింగభూపాలుడు ఎదురేగి మేళతాళములతో తన కొలువు కూటమునకు ఆహ్వా నించి సత్కరించినాడు.

సర్వజ్ఞ సింగభూపాలుని కొలువునకు శ్రీనాథుడు ఎందుకు వచ్చినాడు? ఆశ్రయము కొరకు కాదు

ఆ కాలమున ఉత్కళరాజులు ఆంధ్రదేశదండయాత్రకు సన్నద్ధమగు చుండిరి. రాజమహేంద్రవరము అటు ఉత్కళమునకు ఇటు వెలమరాజ్యమునకు మధ్యనున్నది. ఆంధ్రరాజుల అంతఃకలహములు పరరాజులకు స్వాగతవాక్యములు. ఆ ప్రమాదము తప్పించుటకు రెడ్డిరాజులకు వెలమరాజులకు సంధి సంధానము చేయుటకే-శ్రీనాథుడు సింగభూపాలుని కొలువు కూటమునకు వచ్చినట్లు కాననగును. ఈ ప్రకరణమున శ్రీనాథుడు చెప్పిన పద్యము

సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగ జనపాలునకే
ఉర్వింజెల్లును తక్కొరు
సర్వజ్ఞుడనుట కుక్క సామజ మనుటే.

శ్రీనాథుడు తిరిగి రెడ్డిరాజుల ఆస్థానమున కేతెంచిన తరువాత ఆ పద్యమువిని అందరును ఆతనిని అడిగినారట-"శత్రుస్తవముచేయుట న్యాయమా?"అని. శ్రీనాథుడా పద్యమునే తిరిగి చదివి వినిపించెనట.—

సర్వజ్ఞ నామధేయము
శర్వునకే; రావుసింగ భూపాలున కే
యుర్వింజెల్లును? తక్కొరు
సర్వజ్ఞుడనుట కుక్క సామజ మనుటే.

ఆపద్యమే అచట పొగడ్తయైనది. సర్వజ్ఞ భూపాలుడు సర్వజ్ఞుడైన ఈశ్వరునితో సమానుడు ఇచ్చట-ఆ పద్యమే ఈషత్స్వర భేదముతో తెగడ్తయైనది. శివుడొక్కడే సర్వజ్ఞుడు ఇంకొకరిని సర్వజ్ఞుడనుట కుక్కను ఏనుగ అనుట ఇందలి చమత్కారము తెలుగు బాసకు గల నైసర్గికశక్తికి నిదర్శనము

ఇక శ్రీకృష్ణదేవరాయలు కవులకు చేసిన సత్కారము అనన్యసామాన్యము అతని సాహిత్య సభ-భువన విజయములో అష్టదిగ్గజ కవులకు ఆనాడు జరిగిన సత్కారగౌరవము మకుటాధిపతులకుకూడ జరుగునదికాదు. ఆంధ్ర కవితాపితామహుడైనఅల్లసానిపెద్దన శ్రీకృష్ణదేవరాయల నిర్యాణానంతరము వ్రాసినపద్యముఅలనాడు

ఆంధ్రకవులకు జరిగిన సత్కార విశేషమును ప్రతిఫలించి చూపుచున్న నిలువుటద్దము

ఎదురైనచో దన మదకరీంద్రము డిగ్గి
కేలూత యొసగి యెక్కించుకొనియె
మనుచరిత్రంబందుకొనువేళ పురమేగ
పల్లకి తనకేలఁబట్టియెత్తె
బిరుదైన కవి గండపెండేరమున కీవె
తగుదంచు తానె పాదములతొడిగె
గోకట గ్రామాద్యనేకాగ్రహారంబు
లడిగిన సీమలయందునిచ్చె

"ఆంధ్రకవితాపితామహ–అల్లసాని
పెద్దనార్యః"–అనుచు, నన్ను, పిలుచునట్టి
కృష్ణరాయలతో దివికేగలేక
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబనగుచు.

గండపెండెరము అనగా– వీరుని కాలికి దొడుగు కడియము. ఆనాటి వీర సంప్రదాయానుసారము ఓడిన రాజుల బంగారుకిరీటములు కరిగించి, జయించిన వీరుల కాళ్లకు గండపెండెరములుగా వేయించుకొనెడివారు వీరాధి వీరులకు ప్రత్యేకింపఁబడిన గండపెండెరము ఆంధ్ర సంస్కృతిలో కవికాళ్ళపైబడి భక్తితో ప్రణమిల్లినది. శ్రీకృష్ణదేవరాయలు ఒకనాడు కవిత చెప్పమని కోరగా పెద్దన చెప్పిన పద్యము——

నిరుపహతి స్థలంబు రమణీ ప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన భోజన మూయెల మంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పండితోత్తముల్
దొరికినగాక ఊరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే.

కవులు కలలు గాంచవచ్చును. కోరికలు కోరవచ్చును. చిత్రమేమన ఆంధ్ర కవులు కాంచిన కలలు కలరూపుధరించినవి. కోరిన కోరికలు ఈడేరినవి. పెద్దన కోరిన భోగభాగ్యములన్నియు ఆతనికి లభించినవే. అంతేగాక అతనిని కోకట సీమకు పరిపాలకుడుగా శ్రీకృష్ణదేవరాయలు నియమించినాడు.

ఏనాడో శ్రీకృష్ణదేవరాయలు భువనవిజయమున అష్టదిగ్గజ కవితాసింహాసనముల నేర్పరచినాడు: ఆ స్వర్ణయుగము గతించుగాక! నేటికిని ఆంధ్రుల హృదయములలో ఆ భువనవిజయము నేటికి నిలిచియున్నది.

కవులందరిపై-అందు ముఖ్యముగా ఆంధ్రకవులపై ఆంగ్ల మానసపుత్రులు వేయు నీలాపనింద ఒకటి యున్నది. కవులు అతిశయోక్తులతో భట్రాజుల వలె రాజులను ముఖస్తుతిచేసి బ్రదికిన వ్యర్థజీవులని-వారు స్వప్నజగత్తులో "ఆకుల్ రాలని పూలువాడని నందనారామములలోనుండి" "దిగిరాను దిగిరాను దివినుండి భువికి" అని ఆలపించిన అవాస్తవిక వాదులని విమర్శ బయలు దేరినది. కవితలో అతిశయోక్తి ఆంధ్రభాషకు మాత్రమే పరిమితముగాదు. అది సర్వ సామాన్య సంప్రదాయము. ఆ కవితా పరిభాషను అర్థముచేసికొనిన వారికి అతిశయోక్తిలో అంతర్గర్భితమైయుండు సత్యము సాక్షాత్కరించుచుండును. ఆంధ్రకవులందరు రాజులను ముఖస్తుతిచేసి బ్రతికినవారుగారు ఆంధ్రకవులు కావ్యమువ్రాసినది "జగద్ధితంబుగన్" "విశ్వశ్రేయఃకావ్యమ్" ఆంధ్రుల సాహిత్య సంప్రదాయము నన్నయ-తిక్కన-ఎఱ్ఱనలు-రాజులచేత పాదాభివందనములు పొందిన మహాభాగులు ఆంధ్రకవుల రాజసము నిజమునకు ఏమహారాజులలో గూడ మృగ్యము అనిపించును.

"స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కుల కేలగల్గె యీ
అతులిత మాధురీమహిమ"— అనినాడట శ్రీకృష్ణదేవరాయలు ధూర్జటి వ్రాసిన పద్యము చవిచూడనగును.

రాజుల్ మత్తులు; వారి సేవ నరకప్రాయంబు; వారిచ్చు అం
భోజాక్షీ చతురంత యాన తురగీ భూషాదు లాత్మవ్యథా
బీజంబుల్ తదపేక్ష చాలు! పరితృప్తింజెందితిన్, జ్ఞాన ల
క్ష్మీ జాగ్రత్ పరిణామ మిమ్ము దయతో శ్రీకాళహస్తీశ్వరా!

ఆంధ్రచరిత్రలో రాజులు కవులకాళ్ళు పట్టుకున్నారుగాని కవులు రాజులకు చేయెత్తి యెన్నడూ నమస్కరించలేదు. ఒకవేళ కుక్షింభరుడెవడో గురువు లఘువు చేసి లఘువుగురువు చేసి తంటాలు పడి నాలుగు పాదాలు వ్రాసినవాడెవడో ప్రభువుల మెరమెచ్చుల కాసపడియుండవచ్చు. అట్టివాడు కవిగాడు, అతని రచనలు చతుష్పాత్తులుగాని చతుర కవితలుగావు. అట్టి వారినిగూర్చియే

"కవి యను నామమ్ము నీటి కాకికి లేదే" అని ఒక కవి వేడి నిట్టూర్పు విడువవలసి వచ్చినది. తన కేయూరబాహుచరిత్రను నందూరి గుండన మంత్రికి అంకితము చేసిన మంచెన కవీంద్రుడు చెప్పిన పద్యము ఉదాహరింపదగినది.

బాల రసాల సాల నవపల్లవ కోమల కావ్య కన్యకన్
కూళల కిచ్చి అప్పడుపుకూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి? గహనాంతర భూముల కందమూల కౌ-
ద్దాలికులైననేమి నిజదార సుతోదరపోషణార్థమై?

అయిన-మంచెన కవి, మంత్రిగారి కేల కృతి యిచ్చినాడని ఎదురు ప్రశ్న వేయవచ్చును. ఆ ప్రశ్నకు సమ్యక్సమాధానమున్నది. ఆ మంత్రిగారు మంచి వాడు, కవీశ్వరుని మన్నించుట తెలిసిన రసజ్ఞుడు కవిత్వముకోసమై ధనవ్య యము చేయువాడు-సహృదయుడు-సంస్కృతి గలవాడు అనుటలో సంది యమేమి?

అసలు కావ్యము నరాంకితము చేయనివారు అనేకులు ఆంధ్రకవు లున్నారు. మహానుభావుడు పోతన మహాకవి

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట పోటులంబడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె ఈ
బమ్మెర పోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్.

అని ఎలుగెత్తి దేవదుందుభులు మ్రోగునట్లు ప్రపంచమునకు చాటి ప్రకటించి నాడు. శ్రీ త్యాగరాజు—

"నిధి చాల సుఖమా? రాముని సన్నిధి చాల సుఖమా?

నిజముగ బలుకుము మనసా" అని ఆలపించిన మహానుభావుడు. ఒక నాడు భిక్షావందనములుగా ఒక మహారాజు అతని జోలెలో సువర్ణ నిష్కములు పోయగా మరునాడు వానిని బియ్యముతోపాటు పెంటదిబ్బపై పోసెనట త్యాగ రాజు.

అనేక రాజాస్థానములలో అడుగుపెట్టి రాజాశ్రయమును పొందిన శ్రీనా థుఁడు రాజుల ప్రవర్తనమును తన కావ్యములలో భంగ్యంతరముగ ఖండించి నిరసించిన ధీరుడు.

"ఘనతరాహంకార కాలకూట విషాన
లాభీలములు కటాక్షాంచలములు
దుర్వారతరతీవ్ర గర్వ గళగ్రాహ
కవిత గాద్గద్య ఘర్ఘరము మాట
యస్మితా సంప్రభూత స్మయాపస్మార
విస్రృత ధైర్యంబు వినయగరిమ
యుద్ధామదర్ప ఖారోష్ణ దాహజ్వరా
రంభసంభృత వికారంబు మనసు

చరణచంక్రమ మభిమాన సన్నిపాత
జాత సర్వాంగభంగంబు జనపతులకు ;
భూభుజుల తప్పె యది వారిఁబొందియున్న
ధరణి సామ్రాజ్యభారంబు తప్పుగాక?!

భువనైక ధన్విచేఁ బుష్పాయుధుని చేతఁ
బ్రసవాస్త్రమున నేటుపడనివాడు
అతి గాఢమైన క్రోధాంధకారమ్మున
కన్నుల అంధుండు గానివాడు
నిర్బంధన లోభ నిద్రాభరంబున
పారవశ్యంబుచేఁ బడనివాడు
లక్ష్మీకటాక్ష లీలాసీధుమదమున
మనము లోపల నున్నుకొననివాడు

లేడు! భూపతి!! కలిగెనా వాడు నృపుడె
విశ్వధాత్రీ జనుల పాలి వేల్పుగాక!
బాహ్యశత్రులఁ బరిహరింపంగవచ్చు
అంతరారుల నిర్జింప నలవి కాదు"

కాశీఖండములోని పై పద్యములు చదివినచో ఐశ్వర్యమత్తులు అధికార దృప్తులు నగు అలనాటి ప్రభువుల దౌష్ట్యముపై శ్రీనాథుడు ఎంత ధైర్యముగ "నిర్మోహమోటముగా" సాహిత్యదండయాత్రసల్పినదిసువ్యక్తము. ఒకవేళ-ఈనాటి సామ్యవాద సమాజములో సర్వతంత్ర స్వతంత్రులమనుకొను నవయువ విప్లవ

కవులు సయితము అలనాటి రాజులపై నిందానిరసన పూర్వకమైన కవిత్వము చెప్పదలచినచో శ్రీనాధుడు వ్రాసిన పై పద్యములకంటె ఎక్కువ "ఘాటుగ" ఏమి వ్రాయగలరు?

శ్రీకృష్ణదేవరాయలను ఎంతగా పొగడినాడు పెద్దన! అనిపించును - మను చరిత్ర స్థూలముగా చదివినవారికి. కాని సూక్ష్మదృష్టితో అనుశీలించిన ఆతడు శ్రీకృష్ణదేవరాయలను విమర్శించుటకు వెనుదీసినవాడు కాడను సత్యము అద్భుతముగా స్వయంవ్యక్తము కాగలదు.

కర్తవ్యోపదేశము కావ్యమున సుకుమారముగ ప్రియంవదయైన ప్రేయసీ వచనములవలె నుండవలెను. శ్రీకృష్ణదేవరాయల బహుభార్యాత్వమును పెద్దన ఎంత మృదులముగా కావ్యధోరణిలో విమర్శించినాడో మనుచరిత్ర చివరివరకు చదివినవారికి తేటతెల్లము. స్వరోచి ముగ్గురు భార్యలతో విహరించుచున్నపుడు హంసతో లేడి అనిన మాటలు ఎంత వ్యంగ్యగర్భితములు!!—"పూవుందావియుఁ బోలెనున్న" స్వరోచియొక్కయు, అతని భార్యలయొక్కయు వలపును "అంచ లేమ" మెచ్చుకొనెను. కాని లేడి బహుభార్యాత్వమును "వందిగతి" పెద్దచేయుట నిరసించినది.

ముదమున నిమ్మహీశు దొక ముద్దియ చూడఁగ నొక్క కాంతతో
సదమదమై కడంగి రతి సల్పుట తెల్లమిగా నెరింగియున్
మది వివరించి రోయ కభిమానము దక్కిన వీరి కూరుముల్
వదలక పెద్దచేసెదవు వందిగతిన్ దగ పీ విచారముల్

పలువురయుందు నొక్కనికి బాఁతియు నొక్కనియందుఁ జూడ న
గ్గలమగు ప్రేమ పల్వురకుఁ గల్గుట అద్భుత మట్లుగాన ని
వ్వెలదులయందుఁ గూర్మిపస వీనికి నేమియు లేదు వీనియం
దలవడఁ గగ్గి దీ జలరుహాక్షులకున్ బ్రియ మెవ్విధంబునన్;

కావున దాసీనికరము
కైవసమై సంచరించు క్రమమున విద్యా
ప్రావీణ్య వైభవోన్నతి
చే వచ్చినవారి వీరిఁ జెప్పకు మింకన్.

ఆ మాటలువిని, జంతుభాష నెరిగిన స్వరోచి సిగ్గుతో తలవంచి వేడినిట్టూర్పు విడువవలసి వచ్చినది

ఆ పద్యములను శ్రీకృష్ణదేవరాయలు పలుమారులు పఠించియుండును. అతని దేవేరులు, కవి ముఖమునుండియే వినియుందురు సకల సామంత దండనాథ ప్రభృతులు పౌరులు వీనులార విన్నారు.

"నిరంకుశాః కవయః"-కవులు నిరంకుశులు. ఆంధ్రకవులు నిరంకుశ కవులలో నిరంకుశులు

"లొట్ట యిదేటిమాట పెనులోభులతో మొగమాటమేలనే?

దిట్టకమాన......... . .........తా

కుట్టకయున్న వృశ్చికముఁగుమ్మరి పుర్వని అందురేగదా" అను ఆంధ్ర కవులుండిరి. పొగడుటమాత్రమే ఆంధ్రకవుల అనూదాన సంప్రదాయముకాదు. తిట్టుట తమ జన్మహక్కని భావించినదికూడ తెలుగు కవులే

విజయనగర సామ్రాజ్యమును సార్వభౌమ సమానుడై ఏలుకొనిన తిమ్మరుసుమంత్రిని అధిక్షేపించుచు రామరాజ భూషణకవి:

"గుత్తిన్ బుల్లెలు కుట్టి చంద్రగిరిలో కూడెత్తి పెన్గొండలో
హత్తిన్ సత్రమునందు వేడి పలుదుర్గాధీశు తాంబూలపుం
దిత్తుల్ మోసి పదస్థులైన ఘనులన్ దీవింప"...

అనుచు ఆశుకవిత్వము ఆరంభించినాడు అధాటికి తట్టుకొనలేక-మహామంత్రి ఆమహాకవి కంఠములో ముత్యాలహారము వేసినాడట! వెంటనే ఆ తెగడ్తను కవీశ్వరుడు పొగడ్తగామార్చి పద్యము పూరించినాడని జనశ్రుతి

........."దీవించెదన్... ......

మత్తారాతి యయాతి నాగమసుతున్ మంత్రీశ్వరున్ తిమ్మరుస్."

ఆంధ్రకవులు ఆంధ్రసంఘములో శాపానుగ్రహసమర్థులై, నిరంకుశులై ప్రవర్తిల్లిరనుట కనేకోదాహరణము లున్నవి

తిరుమల దేవరాయలనుగూర్చి ఒక కవి చెప్పిన పద్యము ఉదాహరింపనగును. అతనికి ఒక కన్ను గ్రుడ్డికన్ను. అందుచే రాణిగారితో కలిసినపుడు అతడు సాక్షాత్తు పరమేశ్వరుడు. రాజుగారి ఒకకన్ను+రాణిగారి రెండు

కన్నులు= మూడుకన్నులు- ఒకరాజుగారే అయినచో - శ్రీ శంకరాచార్యులవారు. ఆ ఒక కన్ను లేనిచో ధృతరాష్ట్ర సార్వభౌముడు. లేదా ఇంకొక కన్ను ఉన్నచో మన్మధుడే.

అన్నాతింగూడ హరుడవు
అన్నాతినిగూడకున్న అసుర గురుడ వీ
వన్నా తిరుమలరాయా!
కన్నొక్కటి లేకయున్న కౌరవపతివే.

చతుర్థ పాదమునకు పాఠాంతరము "కన్నిం కొక్కటియె యున్న కంతుడవయ్యా". చమత్కారముల కేమిగాని ఆంధ్రకవులు అంతరాత్మను అమ్ముకొనినవారు గారు.

విద్యానగరసామ్రాజ్య పతనానంతరము గూడ తంజావూరు, మధుర పుదుక్కోటలలో ఆంధ్రభాషకు అధినివేశరాజ్యము లేర్పడినవి. తంజావూరులోని సరస్వతీమహలు లోని తెలుగు గ్రంథములు చెప్పుచున్న సాక్ష్యము చాలు! రఘునాథనాయకుడు- అతని పుత్రుడు విజయరాఘవనాయకుడు ఆంధ్రకవులను ఆదరించినవారే. మహారాష్ట్రులు గూడ ఆంధ్రభాషను ఆదరించినారు. నిన్న మొన్నటివరకు దక్షిణాపథమున విద్యావంతు లందరు విధిగ తెలుగుభాషను అధ్య యనము చేసినారు. త్యాగరాజు మాతృభాషయైన తెలుగు సంగీతసామ్రాజ్యభాష యైనది.

నేటికిగూడ తెలుగుకవులు- విప్లవకవులమని నూత్నకవితా శంఖారావ ములు దిగ్దిగంతములు మారుమ్రోగించుచున్నారు. వారు చేయుచున్న పని ప్రాచీ నాంధ్ర కవినిరంకుశత్వమును కొనసాగించుచుండుటే.

తెలుగు కవులు ఎపుడు ధిక్కార మొనరించి
పాతిపెట్టినారు ప్రాతదనము
తెనుగుదనము అనిన "తెనుగుమీరుట" సుమ్ము
రమ్యహాసలోల ! రామకృష్ణ!

దిగంబరకవులు ఆంధ్రభూమికి సరిక్రొత్తవారు కానేకారు. ఎవరైన కవితలో దిగంబరులుగాని వీథులలో దిగంబరులు కాదుకదా. నడివీధిలో నూత్న చెరిలినుధారికూడ కవితలో దిగంబరుడు కావచ్చు. నూటికి నూరుపాళ్లు నిజమైన

దిగంబరకవి నాటికి నేటికి ఏనాటికి ప్రాచీన వేమనయే. యదార్థమునకు ప్రతికవి దిగంబరకవియే నగ్నహృదయుడు కానివాడు కవియే కాదు. వేమనకవితలో దిగంబరుడు వాస్తవజీవితములో కూడ దిగంబరుడు నిజమునకు ప్రతికవి "పై గంబరుడే." ప్రవక్త కానివాడు కవియేకాదు.

గాంధీయుగమున దేశభాషలు అన్నిటిలో ఆంధ్రసారస్వతమున వెల్లివిరిసిన దేశభక్తి కవిత్వము సర్వవిదితము. కావున నేటికిని- ఆంధ్రకవితాస్రవంతి- ఆంధ్రకవుల స్వచ్ఛందనిరంకుశత్వము యథాపూర్వము కొనసాగుచునేయున్నది. ప్రతికవి నూతన యుగోదయ వైతాళికుడు అతీత యుగధర్మములపై తిరుగు బాటుదారు. ప్రాచీన సరణికి "భరతవాక్యము"- నవీనసరణికి "నాంది" ఆలపించు సూత్రధారియే.

ఆంధ్రకవులకు అత్యద్భుతమైన వాక్శుద్ధి కలదని లోకములో కమ్మని కథలెన్నో ప్రచారములో నున్నవి.

ఆదికవి నన్నయ వ్రాసిన చివరి పద్యము-

శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారక హార పంక్తులన్
చారుతరంబులయ్యె వికసన్నవ కైరవ గంధ బంధురో
దార సమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండు రుచి పూరము లంబర పూరితంబులై.

ప్రకరణానుబద్ధమైన అర్థము-ఆ శరత్కాలమున వెన్నెలలు అంబరపూరితములైనవి. కాని చివరి పదగుంఫనము విరిచినచో "పరపూరితంబులై" అనగా మహాభారతము తానింక వ్రాయజాలనని "పరపూరితము" కావలసినదేయని నన్నయభట్టు మహాకవి సూచించెనా? అది భవితవ్యతాసూచకమైన కవి వాక్శుద్ధికి నిర్వికల్పమైన నిదర్శనమా?

శ్రీరాజరాజనరేంద్రుడు నన్నయ మహాకవిని భారతము వ్రాయమని నపుడు నన్నయ చెప్పిన మాటలు అనుశీలింపదగినవి.

అమలిన తారకా సముదయంబుల నెన్నను సర్వ వేద శా
స్త్రముల అశేష సారము ముదంబున బొందను బుద్ధి బాహు వి
క్రమమున దుర్గమార్థ జల గౌరవ భారత భారతీ సము
ద్రము దరియంగ నీదను విధాత్రునకైనను నేరబోలునే?

అనగా- పై పద్యము అర్థము భారతమును తాను పూర్తిగా వ్రాయలేనని, భారత భారతీసముద్రము అవ్వలియొడ్డు చేరునట్లుగ బ్రహ్మదేవునకుగూడ సాధ్యము గాదని చెప్పుట. ఇక ఎవ్వడైన ఏ బ్రహ్మదేవుడైన ఈదగల్గినచో "కవి బ్రహ్మయే"గదా ఈదగల్గునది; తానేగాక తన తరువాత సుమారు రెండువందల సంవత్సరములపిమ్మట నుద్భవించు "కవిబ్రహ్మ" తిక్కనకూడ పదునైదు పర్వములు వ్రాసినప్పటికిగూడ పూర్తిగా పూరింపలేడని చెప్పినట్లేగదా !

ఈ ప్రయోగము నిరర్థక యాదృచ్ఛిక ప్రయోగమా ? తెలివిగల తెలుగు పండితుడు సమయానుకూలముగ చెప్పుచున్న ప్రజ్ఞావాదమా ? ఏదైన కవి వాక్కు శక్తిమంతమైనదని లోకుల విశ్వాసము. శ్రీకృష్ణదేవరాయలు-ఆనాడు పృథివిలోకెల్ల గొప్ప చక్రవర్తి. పెద్దనకవీంద్రుని ప్రబంధమును వ్రాసి తనకు కృతి ఇమ్మని కోరుకొనెను

సప్త సంతానములలో ప్రశస్తి గాంచి
ఖిలము గాకుండునది ధాత్రి కృతియ గాన
కృతి రచింపుము మాకు శిరీష కుసుమ
పేశల సుధామయోక్తుల పెద్దనార్య!

ఈ పద్యము స్థూలదృష్టికి సుకుమారసుందరమైన కోరికగా భాసించుచున్నది. కీర్తిని నిలుపు సప్తసంతానములలో కవితాకృతి శాశ్వతమైనదని అంతరార్థము. అంతయు బాగుగనేయున్నది. ఇంతమాత్రమే గాదు

సూక్ష్మదృష్టితో అనుశీలించినచో ఆనాడు శ్రీకృష్ణదేవరాయలు సప్త సంతానవంతుడు. ఆ సప్తసంతానములు అంతసులువుగ నశించిపోవునవిగావు. కాని ఆ పద్యము సూచ్యార్థసూచకమైనది. శ్రీకృష్ణదేవరాయలు బ్రదికియుండగనే అతని పెద్దకొడుకు తిరుమలదేవరాయలు దివంగతుడయ్యెను. అతనితరువాత రెండవకొడుకుగూడ రాజ్యమునకు రాకుండగనే మరణించినాడు. భువనవిజయ సభామందిరముతోపాటు విజయనగరదుర్గము-రెండువందల సంవత్సరములు శత్రుదుర్భేద్యముగా వర్ధిల్లిన దుర్గము-నేలపాలైనది "తల్లికోట=రక్షసతంగిడి యుద్ధముతరువాత; ఆ పద్యము వ్రాసినపిమ్మట ముప్పదియేండ్లలో శ్రీకృష్ణదేవరాయల సప్తసంతానములలో "ఖిలముగాకుండ మిగిలినది" 'మనుచరిత్ర' మాత్రమే. ఇట్లే ఆంధ్రకవుల వాక్శుద్ధికి లోకములో వ్యాప్తిలోనున్న కథలు అనేకములు వ్రాయవచ్చును.

"అలమతి విస్తరేణ!"

# భువనవిజయము

ఆంధ్రసంస్కృతికి, అష్టదిగ్గజకవితాసింహాసనములతో విలసిల్లిన భువన విజయము శ్రీకృష్ణదేవరాయల కొలువుకూటము గరిమనాభియైన రసరాజధాని యైనది.

ఆంధ్రసంస్కృతికి దక్షిణాపథమంతయు జేజేలు పలికి అనుకరించినది. 'దేశ భాషలందు తెలుగు లెస్స' ఆంధ్రవీరులకు వీరాభిషేకములు. ఆంధ్రకవులకు కనకాభిషేకములు. ఆంధ్రప్రతిభ అధివసించిన అధ్యక్షసింహాసనము భువనవిజయము. భువనవిజయములో ఆంధ్రుల ప్రతిభ సర్వతోముఖవికాసము చెంది ఆంధ్రసారస్వతమున స్వర్ణయుగము సృష్టించినది. భువనవిజయము ఒకనాటి ప్రాతఃసంధ్యాసమయములో సూర్యోదయముతోపాటు ఉద్భవించినది గాదు. యుగయుగాంతరములు ఆంధ్రప్రతిభ చేసినతపఃఫలము భువనవిజయము.

ఏ మహారాజు బొమముడిపాటు గాంచినంతనే దక్షిణాపథమంతయు దద్దరిల్లి గజగజ లాడిపోయినదో ఏ మహావీరుని కత్తితళతళలు కటకమున్నుండి కన్యాకుమారివరకు దిగ్విజయయాత్ర సాగించి చరిత్రలో నిలుకడ గనిన మెరుపుతీగల మిరుమిట్లు సృష్టించినదో, ఏ సాహితీసమరాంగణ సార్వభౌముని సహృదయత ఆంధ్రసారస్వతమునకు స్వర్ణయుగము కల్పించినదో, ఏ రసజ్ఞ సమ్రాట్టు కటాక్షవీక్షణములు మహాకవుల కలాలు బంగారు కలలను కనునట్లు చేసినదో ఏ రాజ పరమేశ్వరుడు మూరురాయరగండ హత్తిబ్బరగండ జగనొబ్బగండ మాటదబ్బరగండ ఉదయగిరి రాయచూరు చూఱకార బిరుదాంకితుడో ఆ శ్రీకృష్ణదేవరాయలు భువనవిజయాధ్యక్షుడు.

శ్రీకృష్ణదేవరాయల మంత్రి తిమ్మరుసు ఆంధ్రుల శేముషీదౌరంధర్యమునకు నికషోపలముగ ప్రఖ్యాతి వహించెను. పెమ్మసాని రామలింగనాయుడు సేనాధిపతి. "రాయచూరు దుర్గవిభాళ" బిరుదాంకితుడైన నాగమనీడు ఒకదళవాయి. నాగమనీడు కొడుకు విశ్వనాథనాయకుడు మధురసీమకు పాలకుడై అచ్చట మధురనాయక వంశమునకు మూలపురుషుడైనాడు. విజయనగర

సామ్రాజ్యములో దక్షిణాగ్రమునందలి పాండ్యరాజు చోళరాజు కలహించినారు. బలహీనుడైన పాండ్యరాజు రాయలవారిశరణువేడినాడు. రాయలు నాగమనీడును సైన్యముతోఁబంపెను. నాగమనీడు చోళుని ఓడించి పాండ్యరాజ్యమును పాండ్య రాజుకు ఈయకుండ విద్యానగర సామ్రాజ్యములో కలిపినాడు. శ్రీకృష్ణదేవరాయ లకు అది నచ్చలేదు. బలహీనుడు రాజ్యమేలుట నాగమనీడుకు ఇష్టము లేదు అది ప్రజలకు అపచారమని అతని వాదము. విజయనగరము విస్తరించుట జగద్ధితమని "నమ్మినబంటు" నాగమనీడు. రాయలవారు నాగమనీడును జయిం చుటకై ఏసేనాని దండు వెడలగలదని ప్రశ్నింపగా భువనవిజయములోని దండ నాథులెవ్వరు ముందునకు రాలేదు. నాగమనీనికొడుకు విశ్వనాథుడు లేచి రాజాజ్ఞ నెరవేర్చుటకు ఉద్యుక్తుడైనాడు.

తండ్రిని జయించుటకై తనయుడు వెళ్ళినాడు. ఆ యుద్ధములో విశ్వ నాథుడు విజయము సాధించి తండ్రిని బంధీకృతుని గావించి భువనవిజయమున నిలిపినాడు రాయలవారు సంతోషించి ఆతనిని వరము వేడుకొను మనినాడు. ఆతడు తండ్రిబంధవిముక్తినే కోరినాడు. నాగమనీడుకు క్షమాదానము విశ్వనాథు నకు మధురానాయకత్వము లభించినదని చారిత్రక కథనము.

భువనవిజయములో శ్రీకృష్ణదేవరాయలకు వింజామర వీచిన చాకలివాడు దేవరకోట సంస్థానాధిపతి యైనాడు. ఆ రజకనాయకుడే శ్రీకృష్ణదేవరాయల దిగ్విజయయాత్రకు భవ్యకవితావేశము కల్పించి నాందీశ్లోకము పఠించిన సూత్ర ధారియని చెప్పుదురు. తిమ్మరుసు మంత్రితో గలిసి శ్రీకృష్ణదేవ రాయలు మారువేషముతో సంచరించుచున్న సమయములో ఒకనాటి అర్ధరాత్రి ఆంధ్రరజకవతంసము ఆనందతన్మయత్వముతో పాటపాడుచుండెనట:

కొండవీడూ మనదేరా। కొండపల్లి మనదేరా
కాదని వాదుకు వస్తే కటకందాకా మనదేరా॥
కృష్ణానది మనదేరా। గోదావరి మనదేరా!
కోరుకొండ మనదేరా! కోనసీమ మనదేరా!
కాదని వాదుకు వస్తే కటకందాకా మనదేరా!!

ఆ పాట ఆలకించిన వెంటనే శ్రీకృష్ణదేవరాయలు పూర్వదిగ్విజయ యాత్రకు ఉపక్రమించి ఆచాకలివానిని తనఅంగరక్షకులలో ఒకనిగ నియమించి

నాడని కథ. ఆ రజకమహాశయుడు "దేవరకోట" సంస్థానాధీశ్వరుడైన ఉదంతము ఒక అద్భుత కథ.

భువనవిజయములో విద్వత్కవిగోష్ఠి జరుగుచుండగ రాయల వారు ఒక ప్రశ్న వేసినారు. రామాయణము-మహాభారతము జాతీయ కావ్యాలు. ఆ మహాకావ్యములు రెంటియందును సోదరప్రేమ రసస్థాయి నందుచున్నది అయితే సోదరప్రేమలో పాండవులు గొప్పవారా? రాఘవులు గొప్పవారా? అననది చర్చనీయాంశమైనది. రామాయణ పండితులు రాఘవ సోదరులు గొప్పవారని ప్రస్తుతించినారు. మహాభారత పండితులు పాండవ సోదరులు గొప్పవారని వాదించినారు. శ్రీకృష్ణదేవరాయలు ఉభయపక్షములలోని పండితులకు సముచిత సత్కారాలు చేసినాడు. పండితులు సార్వభౌముని అభిప్రాయ మడిగినారు. రాయలవారు తప్పించుకొనచూచినప్పటికి పండితులు "తీర్పు"నకై పట్టుపట్టినారట. అపుడు శ్రీకృష్ణదేవరాయలు "పాండవులే గొప్పవార"ని పల్కినారట. చక్రవర్తి తీర్పునకు భారతపండితులు ఉప్పొంగి జయజయధ్వానములు చేసినారు. అపుడు ఆదికావ్యమునకు-ఆదికవియైన వాల్మీకికి అనుకోకుండ తాను అపచారము చేసినట్లు రాయలవారు చేయునది లేక మిక్కిలి ఖిన్నుడయి తల వాల్చుకొని మౌనము వహించినాడు. సభాసదులు నివ్వెఱబోయినారు సభాభవనమంతయు నిశ్చేష్టమైనది. అపుడు వింజామర వీచుచున్న చాకలి గొంతువిప్పి "ఏలినవారు రూపాంతరములో ఉన్నప్పటికీ పాండవులపై పక్షపాతము ఇంకను పోలేదే"- అన్నాడట వెంటనే రామాయణ పండితులు జయజయధ్వానములు చేసినారట.

శ్రీకృష్ణదేవరాయలు భువనవిజయములో ఆదికావ్యమునకు జరిగిన అపచారమునకు నిష్కృతి ఏర్పడినందుకు సంతోషించినారు. అందును తనతీర్పును త్రోసిరాజనినప్పటికి తనను శ్రీకృష్ణాంశసంభవుడను ప్రస్తుతి అందులో అంతర్గర్భితము. శ్రీకృష్ణదేవరాయలు ఆ రజకనాయకుని ప్రతిభకు మెచ్చుకొని అతనికి "కోరినవరము" నిచ్చెదనని ప్రకటించినాడు. వెంటనే ఆ చాకలి

"దేవర! కోట ఏలుకోవలెనని కోరికగా ఉన్నది అనుగ్రహించ"మని వేడినాడు. భువనవిజయ మహాసదస్సులో కలవర మేర్పడినది. విజయనగర దుర్గమునకు దళవాయి వింజామరవీచు ఆ రజకుడా?

శ్రీకృష్ణదేవరాయలు తిమ్మరుసు మంత్రితో ఆ చాకలి కోర్కె యీడేర్ప వలసియున్నదని శాసించెను తిమ్మరుసుమంత్రి సద్యస్ఫూర్తికి ఆ సన్నివేశము నిరుపమానమైన నిదర్శనము. ప్రభువుల అనుగ్రహము అనుభవ పునరుక్తము. ఆడినమాట తప్పనివాడు శ్రీకృష్ణదేవరాయలు. 'మాట దబ్బరగండ' బిరుదాంకితుడు.

తిమ్మరుసుమంత్రి- "తీర్పు" చెప్పినాడు.

"చాకలి కోరిన కోరిక- "దేవరఃకోట ఏలుకోవలెననికోరికగాఉన్నదని". కృష్ణాతీరమున క్రొత్తగా కోటనిర్మించినాము. దానిపేరు "దేవరకోట" ఈచాకలి ఈక్షణమునుండి ఆ దేవరకోటకు అధిపతి. అతనికి భుజకీర్తులు- ఛత్రచామరములు- కిరీటము- సమస్తరాజలాంఛనములు రాయలవారు అనుగ్రహించుచున్నారు."

ఆవిధముగా దేవరకోటకు ఆచాకలి అధినేతగా వెడలినాడు. రాయలవారి కీర్తి ఇనుమడించినది. తిమ్మరుసు ధీయుక్తి కొంగ్రొత్తపదునువారినది. సాంఘిక జీవనములో నిమ్నజనోద్ధరణమునకు నిదర్శన మేర్పడినది.

భువనవిజయము ప్రపంచప్రజల నాకర్షించి సార్థకనామధేయమైనది. భువనవిజయములో ఛలోక్తులు యుగయుగాంతరాలు దాటి తెలుగువారికి వినిపించుచునేయున్నవి.

శ్రీకృష్ణదేవరాయలు ఒకనాడు భువనవిజయసభకు ఆలస్యముగా వచ్చిన తెనాలిరామకృష్ణుని అధిక్షేపించుటకు చమత్కారముగా "కవివృషభులు ఆలస్యముగా వేంచేసినారు. శాద్వలశ్యామలమైన తివాచీ ఆహ్వానించుచున్న"దని అన్నారట. వృషభశబ్దము శ్రేష్ఠవాచకము. అసలు అర్థము ఆబోతు. తివాచీ ఆకుపచ్చని గడ్డిరంగుది. అర్థాంతరమున ఆ ఆబోతుకు గడ్డి సిద్ధముగానున్నది! చక్రవర్తి మాటకు సభ్యులందరు నవ్వుట సహజము.

కవీశ్వరుని సమాధానములోని సద్యఃస్ఫూర్తి లోకోత్తర చమత్కారజనకమైనది. "కామధేనువు" వంటి ప్రభువులున్నపుడు కవివృషభులకు లోటేమి ఉంధును"- అన్నాడట రామకృష్ణకవి. రాయలవార్లు మెచ్చుకొని రత్నాలహార

మును బహూకరించినారని చెప్పుదురు. భువనవిజయ చరిత్రలో చిరస్మరణీయమైనది పెద్దనకుజరిగిన 'గండపెండేర' బహూకృతి 'గండ' శబ్దమునకు 'వీరుడు' అని అర్థము. అది వీరాభిషేక విజయోత్సవము. వీరాధివీరులకై ప్రత్యేకింపబడిన గండపెండేరమును శ్రీకృష్ణదేవరాయలు స్వయముగా తానేతొడిగినాడు. ఉదయగిరి దుర్గాధిపతి కిరీటమును తనకాళ్లతో తన్నిన జగదేకవీరుడు శ్రీకృష్ణదేవరాయలు స్వయముగా కవీశ్వరుని పాదమునకు గండపెండేరమును తొడిగి తనజన్మ ధన్యమైనదని సంతోషించినాడు

ఒకనాడు భువనవిజయములో కవితాతత్త్వ విచారము చేయుచు ఆశువుగ కవిత చెప్పిన కవీశ్వరునకు గండపెండేరము బహూకరించగలనని శ్రీకృష్ణదేవరాయలు ప్రకటించినాడు

"ముద్దుగ గండపెండియరమున్ గొనుడంచు బహూకరింపగా
ఒద్దిక నాకొసంగుమని ఒక్కరు కోరగ లేరు లేరొకో"

అని శ్రీకృష్ణదేవరాయలు చెప్పినాడట. పెద్దన లేచి

"పెద్దన బోలు పండితులు పృథ్విని లేరని నీవెరుంగవే!
పెద్దన కీఁదలంచినను పేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా".

అని ఆశుధారగా చెప్పిన ఉత్పలమాలిక ఆంధ్రసారస్వతమున ఆలంకారిక శాస్త్రమునకు అలంకారప్రాయము.

పూత మెరుంగులున్ పసరు పూప బెడుంగులుఁ జూపునట్టివా
కైతలుః జగ్గు నిగ్గు నెనగావలె గమ్మనఁ గమ్మనన్వలెన్!
రాతిరియుంబవల్ మఱపు రాని హొయల్ చెలి యారజంపు ని
ద్దా తరి తీపులంబలెను దారసిలన్వలె లోఁదలంచినన్!
పాతిగఁ బైకొనన్వలెను బైదలి కుత్తుకలోని పల్లటీ
కూతలనన్వలెన్ సొగసు కోర్కులు రావలె నాలకించినన్!
చేతికొలంది కౌగిటను చేర్చిన కన్నియ చిన్ని పొన్ని మే
ల్మూతల చన్నుదోయివలె ముచ్చట గావలె పట్టిచూచినన్!
ధా తొడనున్న మిన్నుల మిటారపు ముద్దుల గుమ్మ కమ్మనౌ
వాతెర దొంతరప్పండుగవలె వాతఖిగావలె పంటనూదినన్

గాతల తమ్మిచూలిదొర క్రైవసవుంజవరాలి సిబ్బెపు
న్మేతళి యబ్బరంపు జిగి నిబ్బర పుబ్బగు గబ్బి గుబ్బ పొం
బూతలనున్న కాయ సరిపోఁడిమి గిన్నెర మెట్లు బంతి సం
గాతపు సన్నతంతిఁ-బయగారపు కన్నడు గౌళ పంతుకా
సాతత తానతేనల పసందివుటాడెడు గోట మీటు బల్
ప్రోతలుంబలెన్ హరువు మొల్లముగావలె అచ్చతెన్గు లీ
రీతిగ,- సంస్కృతంబు పచరించిన పట్టున భారతీ వధూ
టీ తపనీయ గర్భ నికటీ భవదాననపర్వ సాహితీ
భౌతిక నాటక ప్రకర భారత భారత సమ్మత ప్రభా
శీత నగాత్మజాగిరిశశేఖర శీతమయూఖ రేఖికా
పాత సుధాప్రపూర బహుభంగ ఘుమంఘుమ ఘుంఘుమార్భటీ
జాతక తాళయుగ్మ లయ సంగతి చుంచు విపంచికా మృదం
గాతత తేహిత త్తహిత హొద్దిత దంధుణు ధాణు ధింధిమి
వ్రాత లయానుకూల పదవార కుహూద్వహ హారి కింకిణీ
నూతన ఘల్లిలా చరణ నూపుర ఝూళఝుళీ మరంద సం
ఘాత వియద్ధునీ చకచకద్వికచోత్పల సార సంగ్రహో
యాత కుమార గంధవహహారిసుగంధవిలాసయుక్తమై
చేతము చల్లఁజేయవలెఁ జల్లునఁ జల్లవలెన్మనోహర
ద్యోతకగోస్తనీ ఫలమధుద్రవ గోఘృత పాయస ప్రసా
రాతి రసప్రసార రుచిరప్రసరంబుగ సారె సారెకున్.

ఒకనాడు శ్రీకృష్ణదేవరాయలు భువనవిజయములో 'పిచ్చివాళ్ల పట్టిక' తయారుచేయమని ఆదేశించి, సహేతుకమైన పట్టికకు పారితోషికమ్ము ప్రకటించి నాడట. ఎన్నో పట్టికలు తయారైనవి. అందులో శ్రీకృష్ణదేవరాయలవారిని ఎదిరించిన వారల పేరులు, అతని సామ్రాజ్యములో ఇంకను చేరని రాజుల పేరులు-ఎన్నో పట్టికలు తయారయినవి. అందరు తెనాలి రామకృష్ణుని పట్టిక చదువమన్నారు. అతడు తనపట్టిక పూర్తికాలేదని-ప్రారంభించి ఒక్క పేరు వ్రాసిన పిమ్మట ఇంకొక్క పేరు తట్టలేదన్ని చెప్పినాడు రాయలవారు ఆ ఏకైక నామమైన చదువమన్నాడు. రామకృష్ణుడు జంకు నభినయించుచు-"శ్రీశ్రీశ్రీ రాజపరమేశ్వర రాజాధిరాజ మూర్ఖరాయరగండ శ్రీకృష్ణదేవరాయ మహారాజులుంగా.

గారు"-అని చదివినాడు. తిమ్మరుసు ఆగ్రహావేశపరవశుడై రాయలవారు పిచ్చి వాడెట్లయ్యెనో నిరూపించమన్నాడు. వికటకవి లేచి-"అయ్యా! యీమధ్య అశ్వవర్తకులు వచ్చినారు అరేబియానుండి; లోగడ వారు తెచ్చిన గుఱ్ఱములకే గాక మార్గమధ్యమున సముద్రయానములో మరణించిన గుఱ్ఱాల తోకలకుగూడ వెలగట్టి డబ్బు చెల్లించినారు." అతని మాటకు అడ్డువచ్చి రాయలవారు-"మన కోసమేగదా గుఱ్ఱాలను అరేబియానుండి తెచ్చినది. చచ్చిన గుఱ్ఱాలను తెచ్చుట అవివేకము. వానికి గుర్తుగా తోకలు చాలు. వానికి డబ్బు ఇచ్చుట న్యాయమే" అని వివరించినారు. తిమ్మరుసుమంత్రి లేచి "అంతేగాదు. దక్షిణాపథచరిత్రలో గజపతులైన ఓఢ్రులు-అశ్వపతులైన బహమనీ ప్రభువులు-నరపతులైన విజయ నగరాధీశ్వరులు-ఆధిపత్యముకోసమై పోరాడుచున్నారు. ఇది వర్తమానచరిత్ర. నరపతులకు సంఖ్యాబలము ఉన్నప్పటికి ఓటమి సంభవించవచ్చు. నవలక్షధను ర్ధరాధీశ్వరులైన కాకతీయులు ఓడిపోవుట-ఓరుగల్లు పతనమునకు కారణము. కవిత్వముతో కలవరించు కవులకేమి తెలియును? యుద్ధభూమిలో గుఱ్ఱమెక్కిన రౌతు ముందుకు వేగముగా ఉరుకగలడు. అంతవేగముగా వెనుకకు పోయి తప్పించుకొనగలడు. అశ్వికదళము అద్యతనచరిత్రను నిర్మించుచున్నది." అని గంభీరోపన్యాసము చేసినాడు.

రామకృష్ణకవి రాయలవారివాదము, మంత్రిగారి వ్యాఖ్యానము సముచితములే అని అంగీకరించినాడు. "అయితే తెచ్చిన గుఱ్ఱాలకు చచ్చినగుఱ్ఱాలకు వెల చెల్లించి నందుకుకాదు. భవిష్యత్తులో మరల తెమ్మని-ఆ గుఱ్ఱాలకోసము రాయలవారు పదిలక్షల వరహాలు చెల్లించినారు. నా ఉద్దేశములో రాయలవారు వట్టి పిచ్చి వాడు-ఆ అరేబియా వర్తకులు పదిలక్షల వరహాలు పుచ్చుకొని పరాయిదేశము పలాయనము చిత్తగించినారు. ఇదివరకు కొన్ని గుఱ్ఱాలు-కొన్ని తోకలు తెచ్చి నారు. ఈసారి గుఱ్ఱాలుకాదు తోకలుగూడ తేరని నా నమ్మకము" అన్నా డాతడు.

రాయలవారు ప్రశ్నించినారు.

"సరే! అది భవిష్యత్తులోగాని తేలదు. తరతరాలుగా సాగవలసినది వర్తకము. ఒకవేళ ఆ వర్తకులు గుఱ్ఱాలు తీసుకువచ్చినచో రామకృష్ణకవిగారేమి చేయుదురు?" రామకృష్ణకవి ఆలోచించకుండ సమాధానము చెప్పినాడు. "పిచ్చివాళ్ల జాబితాలో రాయలవారిపేరు కొట్టివేసి వాళ్లపేరులు వ్రాయగలన్ను,"

రాయలవారితోపాటు సభాసదులందరు కరతాళధ్వానములు చేసి రామకృష్ణుని మెచ్చుకున్నారు.

భువనవిజయములో తెనాలి రామకృష్ణకవి నిర్వహించిన భూమికనుగూర్చి ఆంధ్రదేశమున ప్రచారములో నున్న కథలలో అతిశయోక్తి ఎంత యున్నదో, యథార్థమెంత యున్నదో నిరూపించుట కష్టము ఆ కథలనుబట్టి ఆంధ్ర సంస్కృతిలోని పరిహాస రసికత వ్యక్తమగును.

తెనాలిరామకృష్ణుడు 'వికటకవి'గ సుప్రసిద్ధుడు. ఒకనాడు 'భువన విజయము'లో ఆ వికటకవి సింహాసనము వెనుక జేరి శ్రీకృష్ణదేవరాయలు బోర్ల గిలిపడునట్లు ఒకతన్ను తన్నినాడట! సదస్యులు నవ్వలేరు. నవ్వు ఆపుకొన లేరు. రాయలవారు ఒడలు దులిపికొని తిరిగి సింహాసనము నెక్కినారట తిమ్మరుసుమంత్రి సాయముతో. తిమ్మరుసునకు కోపమువచ్చి- వికటకవికి మరణదండన విధించినాడట. తెనాలిరామకృష్ణుడు శిక్షను రద్దుచేయమని రాయల వారిని ప్రార్థించినాడు కాని తాను అప్పాజీ వేసిన శిక్షను రద్దుచేయలేనని అయి సను మహాకవికి మరణశిక్ష పడుట తనకు విషాదహేతువే అనియు చెప్పినాడు శ్రీకృష్ణదేవరాయలు. అయినను అప్పాజీమాత్రము వికటకవిహాస్యము హద్దుపద్దులు లేక మితిమీరి పోయినదని- తానుమాత్రము వేసినశిక్ష రద్దుచేయనని చెప్పినాడట. శ్రీకృష్ణదేవరాయలు చివరిసారిగ వికటకవికి తిమ్మరుసు- ఒక అవకాశము నొసంగ నర్థించినాడు వికటకవి చేసినది క్షమింపరాని నేరము. కావున మేధావు లలో మేరుపర్వతమని పేరుగాంచిన తిమ్మరుసు మహామంత్రి క్షమాదానము చేయుటకు ఒక షరతుపెట్టినాడు వికటకవి తానుచేసిన తప్పునకు క్షమాపణ చెప్పకోవలెను. అయితే ఆ క్షమాపణ తొలుత అతడుచేసిన నేరముకంటె ఘోరముగా నుండవలెను. తెనాలిరామకృష్ణకవి అందుకు అంగీకరించెను. సభా సదులు ఉత్కంఠులై ఆతని క్షమాపణకొరకు ఎదురుచూచుచుండిరి. వికటకవి-

"మహామంత్రీ- క్షమింప వేడికోలు
మహారాజుగారనుకొని నేను తన్నలేదు,
రాణీగారనుకొని ఆవిధముగా ప్రవర్తించినాను"- అన్నాడు.

శ్రీకృష్ణదేవరాయలు రామకృష్ణుని మెడలో ముత్యాలహారమువేసి ఆతని గౌరవించెను, సభ్యుల కరతాళధ్వనులు మిన్నుముట్టినవి. కాని తిమ్మరుసు

ఆగ్రహావేశపరవశులై "వికటకవి రాజుగారియెడ చేసిన తప్పునకు క్షమాదానము జరిగినది. అయితే రాణిగారియెడ చేసిన అపచారమునకు తిరిగి మరణశిక్ష విధించినాము. ఈసారి శిక్షకు తిరుగులేదు" అని ప్రకటించుటతో రాయలవారితో పాటు భువనవిజయమంతయు ఆశ్చర్యచకితమైనది. వికటకవి తనకుఅన్యాయము జరిగినదని తిరుగులేని మరణశిక్ష వేయుటకు తిమ్మరుసుమంత్రికి అధికారము లేదని వాదించి రాయలవారిని మిక్కిలి దీనముగా శిక్షను రద్దుచేయమని అభ్యర్థించినాడు. రాయలవారు ఆ అధికారము తిమ్మరుసున కున్నదని చెప్పుటతో సభ్యులు నివ్వెఱపోయినారు. కాని రాయలవారు రామకృష్ణునిపై దయచూపమని అప్పాజీని అభ్యర్థించినాడు. అప్పాజీ, "మరణశిక్ష రద్దుచేయను- అయిన రాయలవారిమాట మన్నించుటకు కరుణ చూపగలను. మరణశిక్ష అమలుజరుపుటకు అనేకమార్గములున్నవి. శూలారోహణము- ఏనుగులచే త్రొక్కించుట- తోలు ఒలిపించుట- అవయవములు వరుసగా ఖండించుట...అయినప్పటికీ ఏ తీరుగా మరణించునది రామకృష్ణ కవివరేణ్యులు కోరుకొనవచ్చు. అది ఆయన యిష్టము". అన్నాడు. రామకృష్ణకవి వెంటనే, "మంత్రిగారి కరుణకు కృతజ్ఞుడను; ముసలితనముచే మరణించునట్లు కోరుకొనుచున్నాను" అని జంకకుండ సమాధానము చెప్పినాడట.

మహామంత్రి, శ్రీకృష్ణదేవరాయలు, భువనవిజయ సభాసదులు అందరు కలసి రామకృష్ణకవి ఆంధ్రసంస్కృతిలో చిరంజీవియని ధన్యవాదము లర్పించినారు- తెనాలిరామకృష్ణ మహాకవి అవసానకాలమువరకు జీవించి ముసలితనముచే మరణించినాడు.[1]

భువనవిజయములోని అష్టదిగ్గజము లెవరు? ఆనాడు మనుచరిత్ర వ్రాసిన పెద్దన, పారిజాతాపహరణకవి నందితిమ్మన, శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము

---

1. ఇది కేవలమొక కట్టుకథ కావచ్చు. తెనాలిరామకృష్ణుడు శ్రీకృష్ణదేవ రాయలవారిని నిజముగా తన్నినాడనుట అసంగతమని భావించు వారుండవచ్చు. తన్నినట్లు నటించియుండవచ్చునని కొందరు సమర్థింప నెంచవచ్చు. ఇది కట్టు కథయైనచో-ఇందలి ఆయువుపట్టు హాస్యమే. కథకు కాళ్లుండవని తెలుగులోకోక్తి. కథకు- కాళ్ళుమాత్రమేగాక కళ్ళు ముక్కు చెవులుకూడ లోపింపవచ్చు. కొంతొకచో శరీరమే ఉండకపోవచ్చు. కాని- దేహములు లేని కట్టుకథలు దెయ్యాలవలె మానవ మనస్సులను ఆవహించు చుండుట అనుభవసిద్ధము-

వ్రాసిన ధూర్జటి అష్టదిగ్గజములలోని వారనుట నిర్వివాదాంశము. అయితే తెనాలి రామకృష్ణుడు, రామరాజభూషణుడు, పింగళిసూరన అష్టదిగ్గజ కవితాసింహాసనాసీనులు కాకపోయినను- యువకులుగా నున్నపుడు భువనవిజయ సదస్యులుగా నుండియుండుట నిస్సందేహము. వారు తరువాతికాలమున ఉన్నను, నిజమునకు భువనవిజయము శ్రీకృష్ణదేవరాయలతో అంతరించలేదు. నేటికి భువనవిజయము- సాహితీ స్వయంభువులగు కవీశ్వరులు అధిష్ఠించెడి సువర్ణ సింహాసనములతో ఆంధ్రుల హృదయములలో నిలిచియేయున్నది.

# అవధానములు

అష్టావధానములు, శతావధానములు ఆంధ్రసంస్కృతికి కల్పించిన వైలక్షణ్యము సుప్రసిద్ధము. అవధానములు ప్రాచీనకాలమున సంస్కృతమున గలవని వినికిడి. సంస్కృతమున అవధానములు చేసినది ఆంధ్రులేయని ఒక వాదము. ఏమైన 'అష్టావధానము', 'శతావధానము'లలో ఆంధ్రప్రతిభ స్థిరసౌదామినివలె సదస్యులకు మిరుమిట్లు కల్పించుట సహజము. భారతదేశమునందున్న మరియేభాషలోగాని- లేక ప్రపంచమందే యితరభాషలోగాని ఈ అష్టావధాన ప్రక్రియ కనిపించదు. కన్నడము- మహారాష్ట్రము- తమిళము- ఓఢ్రము మాతృభాషగా గలవారు-ద్విభాషాప్రాంతములనదగిన సరిహద్దులలో నున్నవారు- ఆంధ్రభాషలో జరుగు అష్టావధానమునకు విచ్చేసి అచ్చెరు వొందుట గాంచ వచ్చును.

'అవధాన'మను మాటకు ఏకాగ్రత- తదేకనిష్ఠ అని యర్థము. ఛందోబద్ధమైన కవిత్వము చెప్పుటయే కష్టసాధ్యమైన విషయము. అందును తెలుగుపద్యములో బింకము- అల్లిక బిగిబిగి పేర్కొనదగినది. గణములేగాక యతిప్రాసలు అడుగడుగునకు అడ్డు తగులునవి. అయినను అనర్గళముగా ఆశుకవిత్వము చెప్పువారు తెలుగుదేశమున కోకొల్లలు. నేడేకాక శ్రీనాథుని నాడును ఆంధ్రదేశమున కవులసంఖ్య అధిక మనుటకు అతని చాటువు నిదర్శనము. ''కొండవీటిలో గాడిద నీవునున్ కవివి గావుగదా అనుమాన మయ్యెడిన్" అను శ్రీనాథుని యధిక్షేపణము కుకవిపరముగా నన్వయింపవచ్చును.

అద్యతనాంధ్రకవిప్రపంచనిర్మాతలుగా సుగృహీత నామధేయులైన తిరుపతి వేంకటకవులు అవధానప్రక్రియలో ప్రాతఃస్మరణీయులు. అందు చెళ్లపిళ్ళ వెంకటశాస్త్రిగారిని మొదటి ఆస్థానకవిగా ప్రభుత్వమువారు నిర్ణయించినపుడు బెజవాడలో గొప్ప సన్మానసభ జరిగినది. ఆమహోత్సవమునకు తెలుగు నేల నాలుగు చెరగులనుండి కవులు అసంఖ్యాకముగా విచ్చేసిరి. అధ్యక్షత వహించిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ తొలిపల్కులలో అన్న మాటలు ఉదాహరింపనగును. "ఇచ్చట ఎచ్చట చూచినను కవులు! కవులు!

కవులే! ఒకరాయి ఆకసముపై విసిరిన అవి ఒకకవిపై పడుట తథ్యము." ఆయన విసిరినది రాయికాదు. అది చలోక్తి మాత్రమే.

అవధానమునకు ఆయువుపట్టు ఆశుకవిత. ప్రాచీనకాలమునుండి "శత ఘంటకవి" బిరుదాంకితు లున్నారు గంటకు నేటికీ నూరు పద్యములు ఆశువుగా చెప్పగల కవులు ఆంధ్రదేశమం దనేకులున్నారు. "అదియంతయు కవిత్వమా?" యని మూతి ముడుచువారును లేకపోలేదు. అది మానసికమైన సాముగరిడీలు. అది అచ్చమైన కవిత్వమని ఎవరు అనరు. దానికి తాత్కాలికమైన విలువ లేకపోలేదు.

శతావధానము అనునది కేవలము ఆశుకవితాప్రక్రియ. నూరుమంది పృచ్ఛకులకు కోరిన శీర్షికలపై ఆశువుగా పద్యము అల్లిచెప్పుట. ఆశుకవితకు జతకావలసినది జ్ఞాపకశక్తి. నైసర్గికప్రజ్ఞ లన్నిటికి పునాది. సర్వసాధారణముగ శతావధానమున ఎనిమిదిమందికన్న ఎక్కువ పృచ్ఛకులున్నచాలు. యథాక్షర ముగ నూరుమంది పృచ్ఛకులను కూర్చొనబెట్టి శతావధానము పలుచోట్ల దిగ్వి జయముగా చేసినవారు తిరుపతివేంకటకవులు.

అష్టావధానము- శతావధానముకంటె ప్రజ్ఞాపాటవ వైవిధ్యము గల ప్రక్రియ. అందు ఆశుకవిత్వముకంటె "అవధానత"కు ఎక్కువ ప్రాధాన్య మున్నది. అష్టావధానములో అష్టాంగములు తీర్చిదిద్దినట్లు ప్రస్ఫుటముగా కన్పించును

1. సమస్యాపూరణము, 2 ఆశుకవిత-వర్ణనము, 3. లోకాభిరామాయ ణము, 4. చదరంగము, ఘంటానినాదము, 5. వ్యస్తాక్షరి, 6. దత్తపది 7. నిషేధాక్షరి, 8 గణితము. ఒక అధ్యక్షుడుండుట కద్దు.

అవధానిగారు ఈ అష్ట పృచ్ఛకుల బారినుంచి తప్పించుకొని బయటపడ వలయును. అది ప్రతిక్షణము గండముగనే సభ్యులను విస్మయానంద చకితులను చేయుచుండును. ప్రజ్ఞాధురీణులైన అష్టావధానులు పలువురు నేటికిని ఈ బహు శాంద్రోక్తిమయ ప్రపంచమును అవధానవిద్యచే ఉజ్జ్వలిత లూగించుచున్నారు.

సమస్యాపూరణము అష్టావధానములో నొక అపరిహార్యమైన యంశము. ఒక చరణమో-చరణైకదేశమో పృచ్ఛకుడు 'సమస్య'గా అవధానిగారికి అందిం

చేను. క్లిష్టత లేనిదే సమస్య కాదు. సమస్యాపూరణమువేరు. పాదపూరణము వేరు. ప్రతిసమస్యాపూరణము ఒక విచిత్రవిరోధాభాసముగా పరిణమింపవలసి యుండును. అసలు సమస్యలో ఒక వైరుధ్యము తేరిపారజూడవలెను. ఆ వైరుధ్యము విచిత్రముగా నమసిపోయి సమన్వయము ఏర్పరుపవలసియున్నది. అపుడే అది సమస్యాపూరణము.

అవధానమునందేగాక ఆంధ్రసాహితీనిత్యజీవితములోగూడ సమస్యాపూరణము సముచిత సమున్మేషణము కల్పించుట సహజసిద్ధము. భువనవిజయములో సమస్యాపూరణము సదస్య రంజకమైన యంశములలో నెన్నదగినది. శ్రీకృష్ణదేవరాయలకు జటిలసమస్యాపూరణమన్న మిక్కుటమగు ప్రీతి యని ప్రతీతి. ఒకనాడు రాయలవారు-తిమ్మరుసుమంత్రి-వింజామరవీచు చాకలి-మారువేషములతో విజయనగరములో తిరుగుచున్నపుడు తెనాలి రామకృష్ణుడు తారసిల్లినాడట. రాయలవారు చాకలివానిచేత ఒక జటిలసమస్యను పూరించమని రామకృష్ణుని యడిగించెనట.

"కుంజరయూథంబు దోమ కుత్తుక జొచ్చెన్"

ఇది సమస్య కొక చక్కని యుదాహరణము. ఏనుగుల గుంపు దోమ కుత్తుకలో జొచ్చెనట: అది ఎట్లు సాధ్యమగును? దానిలోని క్లిష్టత సుస్పష్టము. ఆ వైరుధ్యము సమసిపోవలె. నాలుగు పాదములు ఛందోబద్ధముగా "పూరించి" చెప్పుటమాత్రము సరిపోదు. కొంటెకోణంగియైన-వికటకవి-

గంజాయి త్రాగి తురకల
సంజాతుల గొల్చి కల్లు చవి గొన్నావా!
లంజా కొడకా! ఎక్కడ:
కుంజర యూథమ్ము దోమ కుత్తుకజొచ్చెన్?

అని పూరించినాడట. అది సరియైన పూరణము కానేకాదు. అది వికటకవి చేసిన తలతిక్క పూరణము. అయినప్పటికి గోడలకు చెవు లుండును. కాబట్టి ఆనాడే ఆ పద్యము విద్యానగరవీథులలో మారుమ్రోగసాగినది. మరునాడు భువనవిజయ సదస్సులో అదేసమస్యను తిమ్మరుసుమంత్రి ప్రత్యేకముగా పేరుపెట్టి పిలిచి తెనాలి రామకృష్ణునకు ఇచ్చినాడట.

తెనాలి రామకృష్ణుని సమ్యక్‌పూరణము జగత్ప్రసిద్ధమైన పద్యము. ధృతరాష్ట్రుడు సంజయునితో అనిన మాటలుగ కవి భారతపరముగ ఆ సమస్యను పూరించినాడు.

రంజన చెడి పాండవు లరి
భంజనులై విరటు గొల్వ పాల్పడి రకటా
సంజయ ! విధి నేమందును ?
కుంజర యూధమ్ము దోమ కుత్తుక జొచ్చెన్.

ఈ పద్యముపై గల ఆశుకవితాముద్ర, వేత్తలకు విదితపూర్వము. అవధాన కవితలో అసలు సిసలైన కవిత్వముండదని వాదించువారు సైతము ఈ సమస్యా పూరణము వినినప్పుడు తలలూపక పోరు. అవధానములలో సమస్యాపూరణములు విన్నపుడు అసలు రామాయణ భారతాలలో ఆపట్టుల అంత మంచి పద్యాలు ఉన్నవా యనిపించును.

"అరయంగా కర్ణుడీల్గె అర్గురిచేతన్" అనునది ఒకానొక అవధానము లోని సమస్య. దానిని అవధాని పూరించిన విధము నరయఁదగును. కృష్ణుడు అర్జునునితో నన్నమాటలుగ ఆ పూరణము జరిగినది.

నరవర ! నీచే నాచే
వరమడిగిన కుంతిచేత వాసవుచేతన్
గురుచేత శల్యుచేతను
అరయంగా కర్ణుడీల్గె అర్గురిచేతన్

సమస్యాపూరణమునగాని-వర్ణనమునగాని-దత్తపదిలోగాని సర్వత్ర సందర్భము కవిహృదయానుసారముగ సహృదయులు ఊహించుకొనవలసినదే. అవధానములలో కొన్ని సమస్యాపూరణములు :

"భల్లూకపు కడుపులోన భానుడు గ్రుంకెన్"

అల్లంత ప్రొద్దుకాడను
విల్లుంగొని వేటకాడు వేయదొడంగెన్
జిల్లంపకోల చిక్కెను
భల్లూకపు కడుపులోన భానుడు గ్రుంకెన్ !

"చుక్కలలో నొక్కనక్క సుడివడ దిరిగెన్"

చక్కగ గోవర్ధన గిరి
నక్కజమున కృష్ణుడెత్త నావులకొరకున్
గ్రక్కున గిరి మిన్నందిన
చుక్కలలో నొక్కనక్క సుడివడ దిరిగెన్.

"ఎలుకలు తమ కలుగులోని కేనుగు నీడ్చెన్"

ఇలలో ఇద్దరు రాజులు
మలయుచు చదరంగ మాడి మాపటి వేళన్
బల మెత్త మరచిపోయిన
ఎలుకలు తమ కలుగులోని కేనుగు నీడ్చెన్.

"ఉత్తరమున భానుబింబముదయంబయ్యెన్."

అత్తుగ తూరుపు పడమర
చిత్తరువు లిఖించి నిదుర చెందితి నౌరా ॥
చిత్తరవు వ్రాయబోవలె
నుత్తరమున భానుబింబ ముదయంబయ్యెన్.

"చెలువుగ రామలక్ష్మణులు సీతకు తమ్ములు శంభుడన్నయున్."

అలర గణింప పంక్తిరథు నాత్మజులెవ్వరు ? మైథిలుండు ఏ
లలనకు తండ్రి ? మన్మథుని లావు శరంబులునేవి ? అంబికా
చెలువుని నామమెద్ది ? మరి శ్రీశి శౌరియు నేమి కావలెన్
చెలువుగ రామలక్ష్మణులు సీతకు తమ్ములు శంభుడన్నయున్.

* * *

'దత్తపది' యనగా ఇవ్వబడిన పదముల సమాహారము. కొన్ని యసందర్భము లగు పదముల నిచ్చి 'సందర్భశుద్ధి'గల సుప్రసిద్ధ కథానుగుణముగా పద్యములో ననుసంధించమని అవధానిని అడుగుట దత్తపది. ఉదాహరణకు-"గోలకొండ శ్లోలముండ-పూలదండ-క్రొత్తకుండ."

పై దత్తపది భారతపరముగా అన్వయించి ఒక అవధాని చెప్పిన పద్యము.

ఓయి ధృతరాష్ట్ర! నీకొడు కుత్త గోల
కొండ, లోకనాశన మాల ముండనేల?
ఖండనమున గెలిపింతు పాండుసుతుల;
ఉదరమున పూలదండ రేకొత్తకుండ.

"రండ-ముండ-కుండ-బండ"

రామాయణపరముగ

రండటు గంతువేయకుడు ప్రస్తరముల్ గొని తెండటంచు రా
ముండనిసంత వానరసమూహములెల్లను జంకు గొంకు లే
కుండగ మోసితెచ్చి యటులొయ్యన భారము నెంచకుండ పెన్
బండలు చేర్చికట్టిరి శుభస్థితి సేతువు స్వామి మెచ్చగన్.

అదే దత్తపది భారతపరముగ-

రండటు పారిపోవకుడు రండిటు దావిక తప్పదంచు భీ
ముండన కీచకానుజసమూహములెల్లరు వేగ సిగ్గు లే
కుండగ పారిపోయి యటులొయ్యన దాగిరి చెట్టు గుట్ట పెన్
బండల మాటునన్ బెదరి ప్రాణభయంబున ఆర్తమూర్తులై.

## వ్యస్తాక్షరి

ఒక సంస్కృతవాక్యమునుగాని తెలుగువాక్యమునుగాని విడివిడి అక్షరాలుగా వ్రాసి అవధానికి ఒక్కొక్క అక్షరము అందించుట- అనగా

సు క వి తా య ద్య స్తి రా జ్యే న కిం ?
1 2 3 4 5 6 7 8 9 10 11

ముందు 9 తరవాత 5 తరువాత.........ఈవిధముగా తనకుతోచిన అక్షరము నిచ్చును పృచ్ఛకుడు. అవధానానంతరము- ఆవాక్యమును అష్టావధాని చెప్పవలసియుండును. ఒకసారి ఒక ఆంగ్లేయ కలెక్టరుగారు అచ్చెరువువొంది ఆంగ్ల వాక్యమును తెలుగు అక్షరములలో వ్రాయించి ఇప్పించెనట! "The honest

man is the noblest work of God" (ది ఆనెస్ట్ మేన్ ఈజ్ దీ నోబ్లెస్ట్ వర్క్ ఆఫ్ గాడ్) ఆ యక్షరములు అవధానికి వ్యస్తముగా నందించినారు. అపు డవధానము చేసిన తిరుపతివేంకటకవులకు ఆంగ్లభాషరాదు. అయినప్పటికి అవాక్యమును వారు తు. చ తప్పకుండ అప్పగించినారు. జిల్లాకు అధినేతయైన ఆంగ్లేయాధికారి వారికి సముచితసత్కారము చేయుటయేగాక ఒకకత పత్రము ఆంగ్లములో వ్రాసియిచ్చినారు.

నిషేధాక్షరి అవధానికి అగ్నిపరీక్ష- ఏదో ఒక శీర్షికపై అవధాని ఒక పద్యమును ప్రారంభించి ఒక అక్షరమును చెప్పును. తరువాతి యక్షరమును పృచ్ఛకుడు నిషేధించును.

'వి' అని అవధాని ఆరంభించగా- పృచ్ఛకుడు ప్రాసాక్షరము నిషేధించక వదలవచ్చును. అవధాని 'న్న' చేర్చగా పృచ్ఛకుడు 'ప' నిషేధించవచ్చును. అవధాని 'విన్నది' అని తప్పించుకొననగును. పృచ్ఛకుడు అవధానిని మరల ఇరుకున పెట్టుటకు మరల నిషేధించక అతనిమనసును కనిపెట్టదలపోయవచ్చు. లేక 'కన్నది' అని యతడు చేర్చునని 'క' నిషేధించవచ్చు. అవధాని (విన్నది) స- అనగా పృచ్ఛకుడు 'త్య' నిషేధించవచ్చు. ఇట్లే తప్పించుకొనుచు అవధాని పద్యము ఛందోబద్ధముగ పూర్తిచేయవలసి యుండును. ఇంతలో లోకాభిరామాయణ పృచ్ఛకుడు అవధానిని ఇందిరాగాంధిపై పద్యము చెప్పుమని కోరవచ్చును లేదా ఇండియాలో తిండికొరతపై పద్యము చెప్పమని యడుగవచ్చును. అట్లే చదరంగము నాడవలెను; లేదా మధ్యమధ్య మ్రోగిన ఘంటానాదములను చెప్పవలెను. ఇచ్చిన తేదీలకు వారములు గణితముచేసి చెప్పవచ్చును.

నిషేధాక్షరికి ఉదాహరణముగా అష్టావధాని శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వర రాయకవీశ్వరుడు పూరించిన పద్యము.

అలఘు గుణ శ్రీ పూర్వా
విలయఘ్నాః పూర్ణః తల్లిః విద్యుత్ భానూ
-జ్జ్వల కాంతి సమగ్రా రా
వలె కావన్ నిత్య సుప్రభా వేగ ననున్

ఇది శ్రీశైల భ్రమరాంబపై చెప్పిన పద్యము. ఇందులో శ్రీశైలము విద్యుత్ కేంద్రస్ఫూర్తి సుస్పష్టము.

నిషిద్ధాక్షరములు అర్థచంద్రోపరి రక్షితములుగా చూపనగును.

1. అ (ధి) ల (ర) ఘు (త) గు (రు) జ (పూ) శ్రీ (ఖా) పూ (జ) ర్వా
2. (చ) వి ల (ప్రాసకు నిషిద్ధముండకూడదు) (సత్) య (ధి) ష్ఠా (స) పూ (త) ర్ధ (మా) త (ర) ల్లి వి (ధ) ద్యుత్ (కాం) ఖా (స్వ) న్మా
3. (వి) జ్వ ల (దీ) కా (ర) న్తి (ఖా) స (ర) మ (స్త) గ్రా (న) రా
4. (జి) వలె (ర) కా (పా) వన్ (స) ని (ర్మ) త్య [ము) సు (స్థి) ప్రఖా (స) వే (శ) గ (మ) న (లి) నున్.

నిషేధాక్షరి కాళ్లుకట్టి పరుగిడుమనుట వంటిది. ఆ పరుగులో చూప వలసినది వేగముగాదు. దూరముగాదు. నేలపై పడకుండ నడువగలుగుట ఉగ్గ డింపదగిన విషయము.

అవధానులు తమతమ ప్రతిభావిశేషముల కనుగుణముగ ఒకే సమస్యను వివిధరీతులలో పూరించుట గమనింపదగినది. సమస్యలోని వైరుధ్యమ్మును పరిష్కరించుటకు అవధానులకు అవశ్య శరణ్యమైనది ప్రశ్నోత్తర పూర్వకమైన క్రమాలంకారము.

"చెలువుగ రామలక్ష్మణులు సీతకు దమ్ములు శంభుదన్నయున్"

అను పూర్వసమస్యను క్రమాలంకార విరహితముగ పూరింపమని నవ్యుడైన అవధానిని అడుగవచ్చును. అవిధముగా పూరించువారున్నారు ఉదాహరణమ్ముగా

* పిలిచెను తండ్రి శంభుదను పేరున అగ్రతనూజు పేర్మితో
పిలిచెను తల్లి సీతయను పేరున రెండవకాన్పు పిమ్మటన్
గలిగిరి రామలక్ష్మణులనం గవ లయ్యెడ వావులెంచగా
చెలువుగ రామలక్ష్మణులు సీతకు తమ్ములు శంభుశన్నయున్

దత్తపదిలో నిర్దిష్టార్థము రాకుండ చెప్పవలెనని - సంఖ్యావాచకములు సంవత్సరనామములు - రాగముల పేరులు అవధానికి ఇచ్చుటకద్దు. ఉదాహరణ:

సంజయుండనె, ధృతరాష్ట్ర సంధిసెడిన
కీడుమూడు నీ సుతులకు శ్రేయమౌను
పాండవుల కేడుగడ నారదుడౌగాన
వారు పదివేల్ సుమ్ము ధ్రువమ్మునమ్ము



దత్తపది :- తోడి : వరాళి : కల్యాణి (రాగముల పేర్లు) పూరణము.

భయము ధైర్యముతోడిగ వదలి లక్ష్య
రీతి బల్మితో మిశ్రీకరించి పెనగ
భూవరాళి పీగిచనె రాముడు శివువిలు
విరిచి కల్యాణి సీతను పెండ్లియాడ.*

దత్తపది :- విభవ - విక్రమ - బహుధాన్య - దుందుభి పూరణము.

అవనిజతో మహావిభవమారగ విక్రమశాలియైన రా
ఘవు డలిషిక్తుడయ్యె పురిగారముతో చతురబ్ధివారితో
నవబహుధాన్య సంపద దలిర్ప విభీషణ సోదరార్కజుల్
పవనసుతుండు గొల్వగ దివౌకస దుందుభి మ్రోయుచుండగన్.*

అవధాన కళకు ఉచ్ఛ్వాసనిశ్వాసములు సద్యఃస్ఫూర్తి చమత్కారములు.

అవధానమును ఆరాధించుట ఆంధ్రుల సంస్కృతిలోని విశేషము ఒక జాతి సంస్కృతి వైశిష్ట్యమును నిర్ణయించుటకు చూడవలసినది ఆ జాతి సృష్టించిన సాహిత్యము లలితకళలు మున్నగునవి మాత్రమే కాదు. ఏలన - అన్ని దేశములు అన్ని జాతులు ఉత్కృష్ట సాహిత్యమును లలిత కళలను ఉపాసించినవే. ఏ జాతి సంస్కృతియైనను ఆ జాతి కాలక్షేపమునకై ఆరాధించువ్యసనము లనుబట్టి నిర్ణయించుట సరియైనమార్గమని ఒక మేధావి చమత్కరించినాడు.

అట్లయినచో ఆంధ్రసంస్కృతి సృష్టించిన ఉత్తమోత్తమ వ్యసనములలో అవధానము అగ్రగణ్యమైనది.

అవధానములతోపాటు ఆంధ్రుల సంస్కృతికి ఆటపట్టులైనవి పొడుపు కథలు. వినోదకవితా సమస్యలు. రాజాస్థానములలో మేధావులుచేరి వినోద కాలక్షేపముకై కల్పించిన వింతసమస్యలు మనోజ్ఞములైనవి ఎన్నో ఉన్నవి. దీని భావమేమి తిరుమలేశ అను పద్యములు సుప్రసిద్ధములు.

---

* ఈ పద్య పూరణములు శ్రీ రావిపాటి లక్ష్మీనారాయణ కవీశ్వరులవి,

కాలు చేయులేదు కడుపు కొంచెముగాదు
కంట గూడుగుడుచు కలహకంఠి
అంటిన మొరబెట్టు అదియేమి చోద్యమో
దీనిభావమేమి తిరుమలేశ॥ మద్దెల

రాము డెవ్వారితో రావణు మర్దించె
వరవాసుదేవుని పురమదెద్ది
రాజమన్నారుచే రంజిల్లు శరమెద్ది
వెలయ తానుగవంటి క్షేత్రదెద్ది
అల రంభ కొప్పులో అలరు మాలికయెద్ది
ఏతోట నరునిచే ఇంపుతూసె
సీత కుంకువగాగ చేసిన శరమెద్ది
సఖ వాగి నవ్వించు జాణ యెవ్వ

దన్నిటికి చూడ ఐదేసి అక్షరంబు
లౌనర నిరుదెస చదివిన ఒక్క పేరె
సమ్మతిగ చెప్ప సర్వజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగుదునే చిన్ని నగవు.

సమాధానములు 1. శోకమూకతో 2. రంగనగరం 3. లక్కోలక్కోల 4. జంబీరబీజం 5. మందారదామం 6. నందసదనం 7. పంచాస్యచాపం 8. వికటకవి.

వినోదమునుగూడ విజ్ఞానదాయకము చేసిన ఘనత ఆంధ్రసంస్కృతికి దక్కినది.

# ఆంధ్రుల అభిరుచులు

## తెలుగుదనములోని తీరు తీయములు

తెలుగువారి జీవితము-ప్రతి సంవత్సరము నూతన సంవత్సరాది-ఉగాది పండుగతో ప్రారంభము. ఆ నాడు అభ్యంగన స్నానముచేసి ఆంధ్రులు ఉగాది పచ్చడి - వేపపువ్వొడి, మామిడిపిందెలు-చింతపండు పులుసు-బెల్లము-అరటి పండ్లు, తేనె మున్నగువానితో చేసిన షాడబరసము సేవించి నూతన సంవత్సర జీవితయాత్ర ప్రారంభించగలరు. తెలుగువారిది చాంద్రమానమే అయినా అధిక మాసాలతో కలుపుకొని సౌర మానమునకు సరిపెట్టుకొనుట జరుగుచున్నది. అందుచే ఉగాది వసంతోదయ సూచకము. చైత్రమాసారంభము.

ఆమని వేపపువ్వొడి రసార్ద్రి మనోజ్ఞనవీన తింత్రిణీ
కోమల శర్కరారుచులకున్ కదళీఫలపాక సిద్ధికిన్
మామిడిపింది లేవగరుమాటిడి క్షీరమధుస్రవంతికా
భూమి కుగాది తెచ్చు సుఖభోగులుగందు తెలుంగు సోదరుల్.

అని కవిభాషణము.

ధ్యానఫలోద్గమమ్ము; వనసుందరి పూవుల మేల్ముసుంగు తై
సేతలు మల్లెలే వలపుసిగ్గుల వెన్నెలతోల్కి షడ్రసో
పేతముగాగ మా తెలుగుబిడ్డల జీవితమెల్ల దిద్ది ఈ
నూతన వత్సరంబిక మనోరథ సిద్ధులొసంగి యేగుతన్.

అని కవి ఆకాంక్ష.

షడ్రసోపేతమైన అభిరుచి తెలుగువారికి ఉగాది కానుక. ఆంధ్రదేశములో ఉన్నవారికి ఉగాదినాడు ఉదయమే నోరూరుట రుచిమరగినవారికి అనుభవ పూర్వకము,

ఉగాదినాడు ప్రారంభమై ఆంధ్రదేశములో వసంతోత్సవము మహా వైభవోపేతముగా జరుగుచుండెడిది. కొండవీటి రెడ్డిరాజులలో కర్పూర వసంత రాయలుగా పేరెన్నికగన్న కొమరగిరి చక్రవర్తి కాలములో వసంతోత్సవము శ్రీనాథుని వర్ణనలవలన చిరస్మరణీయమైనది. వసంతోత్సవములో కోలాటములు-బురఖా బొమ్మలాటలు-ఊరేగింపులు-నాట్య సంగీత వినోదములు-తోలు బొమ్మలాటలు-హరికథలు-విచిత్రవేషములు-పగటివేషములు-భాగవతములు- జానపద ప్రభలు-వేడుకలు-సంబరములు జరుగుచుండెడివి.

కర్పూర వసంతరాయలు కొలువులో ఆ నాటి రాజనర్తకి లకుమాదేవి అభినయాభినివేశము జగత్ప్రసిద్ధము.

కొమరగిరి చక్రవర్తి ఆస్థానములో సుగంధ భాండాగారాధ్యక్షుడు అవచి తిప్పయ్యసెట్టి ద్వీప ద్వీపాంతరముల వర్తకము నెరపి వసంతోత్సవ శోభను ఇనుమడింపచేసిన వణిజశిఖామణి మాత్రమేగాక సంగీతసాహిత్య రసికుడు శ్రీనాథ మహాకవి అవచి తిప్పయసెట్టికే తన హరవిలాస మహాకావ్యమును అంకిత మిచ్చియున్నాడు.

శ్రీనాధుడు కర్ణాటాంధ్ర క్షితీశ్వరుడైన సాంపరాయని తెలుంగురాయల కొలువునకేగి చెప్పిన పద్యము.

అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ, కస్తూరి కా
భిక్షాదానము సేయరా సుకవి రాడ్బృందారక శ్రేణికిన్
దక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ
వక్షోద్వయ కుంభి కుంభములపై వాసించుఁ దద్వాసనల్.

ఆ మహారాజు చేసిన కస్తూరీదానము ఎచ్చట పరిమళించవలెనని ఆ మహా కవి కోరికః అది తెలుగువారి రసికతకు మచ్చుతునక.

రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభయైన నేకులె వడకున్
వసుధేశుడైన దున్నును
కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్.

అని శ్రీనాధుడు వ్రాసిన పద్యము సుప్రసిద్ధము.

అలనాటినుండి ఆంధ్రులకు వరియన్నముపై మక్కువ హెచ్చినది. "అంగడి యూరలేదు వరియన్నము లేదు" అలనాడు పలనాడులో. కాని-యీనాడు వరిఅన్నము పలనాటిసీమలో ప్రజలు విరివిగా తినుచున్నారు.

గరళము మ్రింగితి ననుచున్
బురహర గర్వింపఁబోకు పో! పో! పో! నీ
బిరుదింకఁ గానవచ్చెడి
మెరసెడి రేనాటి జొన్న మెదుకులు తినుమీ.

అను చాటువుగూడ జొన్నకూడును అధిక్షేపించు చున్నది. వరి అన్నము తినుట నాగరికుల లక్షణము గావచ్చును గాని జొన్నకూడు తినుట పౌరుష పరిపోషకము. శరీరదార్ఢ్య సంవర్ధకము.

స్వర్గలోకములో పలనాటి వీరుడు బ్రహ్మనాయుడు శ్రీనాథ మహాకవిని కలుసుకొనెనట! ఆ మహాకవిని తనతో విందారగింప బ్రహ్మనాయ డాహ్వానించినాడట. శ్రీనాథుడు - "జొన్నకూడు" పెట్టనిచో వచ్చెదనని చెప్పి,

"మా కొండవీడులో జొన్నలు గాడిదలకు ఆహారము
మీ పలనాడులో జొన్నలు వీరులకు విందు"

అని పరిహసించినాడట.

బ్రహ్మనాయడు -

"నిజమే, అందుచేతనే మీ కొండవీడులో గొప్పగాడిదలు ఉద్భవించినవి.
మా పలనాడులో గొప్పవీరులు ఉద్భవించినారు" 1

అని సద్యఃస్ఫూర్తితో సమాధానము చెప్పినాడని ఒక కట్టుకథ. పరిహాసజనితమైన ఈ కట్టుకథలోని పరమార్థము ఆరయదగినది. నాగరకత పేర తెలుగువారు రానురాను నీరసాహార భక్షకులుగా దిగజారిపోవుచుండుట శోచనీయము.

తెలుగువారి రసికతగూడ అట్టిదే. కస్తూరి, కర్పూరము-పునుగు, జవ్వాది కుంకుమపువ్వు-చందనము-తెలుగువారి దినచర్యను తీర్చిదిద్దినవి. శృంగారము ఆంధ్ర హృదయములో అధినినేశ సామ్రాజ్యమును నెలకొల్పినది.

---

1 "కొండవీటిలో, గాడిద నీవునుం గవివిగావుగదా అనుమాన మయ్యెడిన్" అను శ్రీనాధుని పద్యము ఇప్పట్టున స్మర్తవ్యము.

"ఆనందో బ్రహ్మయటన్న ప్రాజదువు నంతఠచ్ఛద్ది నూహింపుమా"
అని ఆంధ్ర వరూధిని అలనాడు ప్రవరాఖ్యునిపై బడినది.

"చెప్పకుమిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్"
అన్నాడు ఆ ప్రవరాఖ్యుడు, వరూధినీ ప్రణయబంధమునుండి విముక్తుడగుచు. విజయముకై వీరశృంగారముల పోరాటము ప్రతి సంఘములో సతతము జరుగు మనేయుండును. ఆ నాడు వరూధిని గెలిచియున్నచో విజయనగర సామ్రాజ్యము ఓడిపోపుట నిశ్చితపూర్వము. ఆనాడు వెల్లివిరిసిన తెలుగువారి శృంగారము చెలియలికట్టను అతిక్రమించలేదు.

తదనంతరము- తార (బృహస్పతి సతీమతల్లి) భర్తకు శిష్యుడైన చంద్రునితో చెప్పినమాటలు

లోకములోన కొందరబలుల్ సతులన్ దనియింపలేక అ
స్తోక మనీష అన్య పురుషుల్ తమ కాంతల నంటకుండ తా
టాకులలోన వ్రాసిరి పరాంగన గూడిన పాపమంచు అ
య్యాకుల పాటు చూచి ఇపుడాకుల పాటెనయంగనేటికిన్.

సంఘమునకు సాహిత్యమునకు గల బింబ ప్రతిబింబ భావము మేధావులకు సుగమము. సాహిత్యము సాంఘిక పరిస్థితికి "బరామీటరు" వంటి, స్థాయి సూచి. పై పద్యము పుట్టిన సమయములో సంఘము అన్యాక్రాంతమై, ఆంధ్ర దేశము విజేతలకు దాసోహమన్నమాట విస్మరింపరాదు. ఆంధ్రసంస్కృతి భోగ లాలసత్వమునకు విషయలౌల్యమునకు లొంగిపోయిన దుర్బల సమయములు లేకపోలేదుగాని, అవి చాలతక్కువ. ఆంధ్రజాతి అనుభవించిన స్వాతంత్ర్యము భారతదేశ చరిత్రలో పేర్కొనదగినది.

## ఆంధ్రసంస్కృతి - వీరరసాభినివేశము

భారతదేశ చరిత్రలో మెగస్తనీసు ఆంధ్రులను వీరజాతిగా- చతురంగ బల సమేతమైన జాతిగా పేర్కొనినాడు. "వడగరులు" (తమిళ సాహిత్యము తెలుగువారికి పెట్టినపేరు. తమకు ఉత్తరాదివారు) రణకుశలులని మౌర్యుల సేనాగ్ర భాగవర్తులని ప్రాచీన తమిళ కవులు ప్రశంసించి యున్నారు. భక్తి

వాహన యుగములో ఆంధ్రులు త్రిసముద్రాధిపతులు. మగధ ఉజ్జయిని కుంతల రాజ్య విజేతలు. ద్వీప ద్వీపాంతరములలో అధినివేశ సామ్రాజ్య నిర్మాతలు. ఇక్ష్వాకు పల్లవ శాలంకాయన విష్ణుకుండిన చాళుక్య రాజ్యములు ఆంధ్రులు స్థాపించిన స్వతంత్రరాజ్యములు. అట్లే కాకతీయ సామ్రాజ్యము. భారతదేశ చరిత్రలో తొలిసారి ఆంధ్రుల పరాజయము పేర్కొనదగినది క్రీ.శ. 1323 ఓరుగల్లు పతనము. ఉలూఘ్‌ఖాన్ (తరువాత తుఘ్లకు చక్రవర్తి) సేనాపతిగ జరిపిన దండయాత్రలో ప్రతాపరుద్రుడు బంధీకృతుడైనాడు. ఆంధ్రులకు తాత్కాలిక పరాజయము సిద్ధించినది. ఆ పరాజయమునకు ఆంధ్రుల పరాక్రమలోపము కారణము కాదు. ఆంధ్ర వీరులచే ఉలూఘ్‌ఖాన్ అంతకు ముందు పలుసారులు పరాజయమందిన సంగతి మరువరాదు.

ప్రతాపరుద్రుని నాయకులలో నొకడగు పోతుగంటి మైలి "ఉప్పర పల్లొద్ద నుద్ధతిపైబడి ఢిల్లీ తురుష్కుల త్రుళ్లడంచె" అని క్రీ.శ. 1304 నాటి శిలాశాసన వర్ణన. వెలుగోటివారి వంశావళిలో వెన్నధరణిపుడు రాణిరుద్రమదేవి దండనాథుడు రేచెర్ల ప్రసాదాదిత్యుని కొడుకు, "సన్నద్ధ ప్రసర తురుష్క పృతనా సందోహ నిర్మూలనో త్పన్నానూన యశుండని" వర్ణితము. రావెళ్ళ వారి బిరుదావళిలో

"వులువఖానుని సప్తాంగ చూఱకార"
"మలుక నేమానుని మాన మర్దన"

అను బిరుదులున్నవి. ఉలూఘ్‌ఖానుని మాలికఖాపరును తెలుగువారులు అనేకపర్యాయములు జయించియున్నారు. బంధీకృతులైన తెలుగు వీరులు పోతుగంటి మైలి, తెలుగు బిజ్జలులు జగదేకవీరులుగా సుప్రసిద్ధులు. తెలుగుభటుల కత్తిసాము ఆనాడు విశ్వవిఖ్యాతము. జగదేకమల్లులు పోతుగంటి మైలి, తెలుగు బిజ్జలుల ఎక్కటి కయ్యమును చూడవలెనని ఢిల్లీసుల్తాను ఒక బహిరంగ ప్రదర్శనము నేర్పాటు చేసినాడు. ఆ ఉభయ వీరుల కత్తిసాము ఢిల్లీలో సుల్తాను సమక్షమున "డాకోలు"లో జరిగినది పౌరులు, దండనాథులు, భటులు ఆ ప్రదర్శనమును సంభ్రమాశ్చర్యములతో సందర్శించినారు. అల్లావుదీను, మాలిక్ ఖాఫరులు తీర్పరులుగా నుండిరి,

ఢిల్లిలో సురథానుఁ దల్లావుదీ ధరా
ధ్యక్షుండు ప్రత్యక్ష సాక్షిగాగ
మహనీయ జయశాలి మలికి నే మానుండు
జగదేకశూరుండు సాక్షిగాగ
జగతిపై దెబ్బదేడుగురు నాయంకులు
అక్షీణబలయుతుల్ సాక్షిగాగ
సహజ సాహస యుద్ధ సన్నద్ధ వర భటా
శ్రయమైన డాకోలు సాక్షిగాగ
సూర్య వంశోదయ ఖ్యాతు దార్య తెలుగు
బిజ్జల నృపాలు గెల్చెఁ దద్భీమబలుడు
వైరి గజ భీము దమిత సత్యప్రియుండు
ఘన భుజా శాలియగు పోతుగంటి మైలి.

శత్రువులు గూడ గౌరవించి అగ్గించు రణకౌశలము పరాక్రమ ప్రాభవములతో తెలుగువీరులు వర్ధిల్లినారు.

కాకతీయుల కాలమున తెలుగువీరుల రణదర్పము ప్రతిఫలించు మణి దర్పణము విద్యానాథుని ప్రతాపరుద్రీయము. అందు తెలుగువీరులు పాండ్య దేశముపై దండెత్తి నెరపిన దిగ్విజయయాత్ర నాటకీయముగ అభివర్ణితము. ఆ ఆలంకారిక గ్రంథములో పలుతావుల ఆంధ్రవీరుల పరాక్రమ ప్రకర్ష ఉదాహరణ ప్రాయమైనది. విద్యానాథుడు సంస్కృత గ్రంథమున ధీరోద్ధతకు ఆంధ్రభటుల ఉదాహరణముగా నెన్నెను:

రే రే! ఘూర్జర! జర్జరోఽసి సమరే లంపాక కిం కంపసే?
వంగ! త్వంగసి కిం ముధా: బల రజః కాణోఽసి కిం కోంకణ;
హూణః ప్రాణ పరాయణో భవ; మహారాష్ట్ర పరాష్ట్రోఽస్వమీ
యోద్ధారో వయమిత్యరీ నభిభవం త్యంధ్ర క్షమాభృత్భటాః.

"ఓరీ ఘూర్జర: నీవు సమరములో ముక్కలు ముక్కలై పోవుదువు. ఒరీ లంపాకుడా! ఏమట్లు గజగజ వణకిపోవుచున్నావు: వంగ భటుడా: నీసంగతి ఇంతే. ఏమి కాణుడా నీగతిగూడ ఇంతేగదా. కోంకణ భటుడా నీసంగతి? ఏమిరా? ఓ హూణుడా: పారిపోయి నీప్రాణాలు దక్కించుకో. ఓమహారాష్ట్రుడా

వీరాగ్రిము వమ్మైపోయినది. మేము మహాయోధాగ్రేసరులమైన ఆంధ్ర రాజభటు లముసుమా ! జాగ్రత్త."

ఇది ఆంధ్రవీరుల ఆత్మ ప్రత్యయము.

మహాభారతము ఆంధ్ర సారస్వతమున ప్రథమ గ్రంథము మాత్రమే గాక ప్రథాన గ్రంథముగా వర్ధిల్లుటకు ముఖ్యకారణము అది వీరరస ప్రధాన మగుట. ఆంధ్రుల వీరరసాభినివేశమునకు అదియొక తార్కాణము.

అపర భారతకథగా ఎన్నదగిన పలనాటి వీరగాథ ఆంధ్రదేశమున జరిగి నది. పలనాటి వీరకథ భారతకథతో అత్యద్భుతముగ సంవదించుచున్నది.

భారతములో కురు పాండవులు దాయాదులు.

పలనాటి వీరకథలో గూడ దాయాదుల వైరమే.

భారతములో నిర్జీవ ద్యూతము యుద్ధబీజములు నాటినది.

పలనాటి వీరకథలో సజీవద్యూతము - కోడిపందెములు-యుద్ధజ్వాలలు రగులుకొల్పినది.

ద్యూతము భారతములో అరణ్యవాస కారణమైనది.

పలనాటి వీరకథలోకూడ పరాజయానంతరము బ్రహ్మనాయని పక్షము అరణ్యవాసము చేసినారు.

అరణ్యవాసానంతరము భారతములో శ్రీకృష్ణుని రాయబారము ముందు ద్రుపదపురోహితుని రాయబారములు జరిగినవి.

పలనాటివీరకథలో భట్టు రాయబారము తరువాత అలరాజు రాయబారము జరిగినవి. పిమ్మట

అటు కురుక్షేత్ర సంగ్రామము

ఇటు కార్యమపూడి కదనము.

శ్రీకృష్ణుడు విదురుని ఇంట విందారగించిన వివేకి.

పాపము అలరాజు విషప్రయోగముచే మరణించుట. అతని సతీమణి పేరంటాలు పేరమ్మ సలిపిన సహగమనము హృదయవిదారక సన్నివేశములు.

భారతములోని అభిమన్యునకు ఏమాత్రము తీసిపోని పలనాటి వీరుడు బాలచంద్రుడు.

భారతములో ధర్మరాజు అజాత శాత్రవుడుగ అభివర్ణితుడు. భారతము చదివిన తెలుగువారికి ఆ అజాత శత్రుడు "మెత్తనిపులి" అని తెలియును. భారతములో ధర్మరాజునకు సంక్రమించిన యుధిష్ఠిరుడను పౌరుషనామధేయము అన్వర్థకమైన బిరుదుగా గన్పించదు. అపర ధర్మరాజుగ విఖ్యాతిగాంచిన పలనాటి బ్రహ్మనాయడు యదార్థమైన తెలుగు యుధిష్ఠిరుడు. అజాత శత్రువు ధర్మరాజు పురాణపురుషుడు. బ్రహ్మనాయడు క్రీ.శ. 12వ శతాబ్దిలో తెలుగుదేశమున రక్తమాంసలమైన మానవదేహముదాల్చి మసలినవాడు. చారిత్రక పురుషుడు. బ్రహ్మనాయడు ప్రతిష్ఠించిన చెన్నకేశవాలయమున మాచెర్లలో అలనాటినుండి పంచములకు (హరిజనులకు) ప్రవేశముండుట గమనింపదగిన విశేషము. గాంధి మహాత్మునకు సుమారు ఎనిమిది శతాబ్దులు ముందే హరిజనోద్ధరణమునకు బద్ధ కంకణుడైనవాడు తెలుగు బ్రహ్మనాయడు. అతని ధర్మపుత్రుడు దండనాథుడు కన్నమదాసు. బ్రహ్మనాయడు కులభేదములు పాటింపక అందరకు ఏకపంక్తి భోజనము "చాపకూడు" ఏర్పాటుచేయించిన సంఘసంస్కర్త తుదకు తనకు ప్రతిపక్షమునకు నాయకత్వము వహించిన నాయకురాలిని గూడ బ్రహ్మనాయడు యుద్ధమున సంహరింపక విడిచిపుచ్చెనని జనశ్రుతి.

"భారతము" ఒక పురాణగాథ.

పలనాటి వీరకథ చరిత్రలో జరిగిన యధార్థ సన్నివేశము.

పలనాటి వీరులగాథ ఆంధ్రదేశమున ఆబాలగోపాలము ఉద్రూతలూగించి ఆంధ్రుల వీర రసాభినివేశమునకు తరతరాల దోహదము కల్పించుచున్నది. పలనాటి వీరుల కథను కన్నులకు కట్టినట్లుగా బుర్రకథగ జక్కులవాంద్రు వినిపించినారు. పలనాటి వీరకథ ద్విపద ప్రబంధముగా వెలసినది. అందుకొంత భాగము శ్రీనాథ కవిసార్వభౌముడే రచించినట్లున్నది. అయినను ఆ కావ్యము రననతో ఆంధ్రదేశమున శ్రవ్యప్రబంధమైనను, ప్రేదారకములో దృశ్యకావ్య ఫణితిలో వర్ధిల్లినది.

పలనాటి వీరకథ వంటిదే కాటమరాజు కథ.

ఇది ద్విపద కావ్యమే. కాటమరాజుకథ సారస్వతమా? చరిత్రయా? సారస్వత మనుటకంటె చరిత్ర అని చెప్పుటయే సమంజసము. ఇట్టిదే వీర బొబ్బిలిగాథ. ఇవి యన్నియు ఆంధ్రుల వీర రసాభినివేశమునకు నికషోపలము లుగా నెన్నదగిన నిదర్శనములు.

నెల్లూరు ప్రభువైన నల్లసిద్ధికి కనిగిరి ప్రభువైన కాటమరాజుకు 'పుల్లరి' కారణముగ పోరాట మేర్పడినది. కాటమరాజు పక్షమున పలనాటి పద్మరామవుడు చల్ల పిన్నమనీడు, దొనకొండ అయితన్న, కరియావులన్న, ఆవుల పోలరాజు పంచలింగాల ప్రాంతమున సైన్యమును సమీకరించుకొనిచేరిరి. నల్లసిద్ధి పక్షమున ఉర్లకొండ సోమయ్య, ఉదయాద్రి ఉమ్మయ్య, చన్నపట్టణము చంద్రశేఖరుడు, కాళహస్తి తిమ్మరాజు, నందికనుమ నాగరాజు మొదలగు వీరులుచేరి సర్వేపల్లి మెట్టవద్ద సైన్యము సమీకరించినారు. ఈ యుద్ధములో ఎన్నదగినది ఖడ్గతిక్కన నిర్వహించిన భూమిక.

## కలము : కత్తి

యావత్ ప్రపంచము చర్చించు సమస్య కలము : కత్తి ఏది గొప్పది? ఆంధ్రదేశమున కలము ; కత్తి సమముగా త్రిప్పగల కార్యఖడ్గ నిపుణులు అనేకులు విలసిల్లినారు. అట్టివారిలో "తిక్కన" సోదరులు పేర్కొనదగినవారు. ఆంధ్ర మహాభారత రచయిత కలము తిక్కన. కాటమరాజు యుద్ధములో పోరాడినవాడు ఖడ్గతిక్కన. ఉభయులు సమకాలీనులు. ఏక కుటుంబములోని సోదరులు. ఆ మహాయుద్ధములో భటులందరు మడిసిన పిమ్మట అసహాయ శూరుడై ఖడ్గతిక్కన యుద్ధముచేయుట చూచి

పోదు నిల్పుమోయి భూసురోత్తమ
సరిగాదు మాతోడ సమరంబు చేయ
అగ్రజులే మీరు యాదవులము మేము
ఉగ్రము మామీద నుంచంగరాదు

అని ఎదిరి పక్షములోని పిన్నమనీడు పలికెనట.

ఖడ్గతిక్కన యింటికి మరలి వచ్చిన పిమ్మట అతనికి జరిగినసన్మానము సుప్రసిద్ధము. వీరపత్నియైన ఆతనిభార్య అతనికి స్నానోదకముతోపాటు పసుపుముద్ద పెట్టి నులకమంచము అడ్డమురంచినదని కథ.

పగరకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకులెందున్
ముగురాడు వారమైతిమి
వగపేటికి జలకమాడ వచ్చిన చోటన్,

అని అధిక్షేపించినది ఆ వీరపత్ని.

ఇక వీరమాత అతనితల్లి అతనికి విరిగిన పాలుపోసి అన్నము పెట్టుచు

అసదృశముగ నరివీరుల
బస మీఱఁగ గెలువలేక పందక్రియన్ నీ
వసివైచి విఱిగి వచ్చిన
ఐసులున్ విరిగినవి తిక్క పాలున్ విరిగెన్.

అని పరిహసించినది.

అటుపిమ్మట ఖడ్గతిక్కన ఏకాకియై రణరంగముచేరి విజయమో వీర స్వర్గమో యని పోరి వీరస్వర్గ మలంకరించెను. ఆయుద్ధము ఖడ్గతిక్కన పరాక్రమము ప్రజల హృదయములపై ఎట్టిప్రభావ ముద్రవైచినది సమకాలీన చాటు పద్యములు చాటుచున్నవి.

ధైర్యంబు నీమేనఁ దగిలియుండుటఁజేసి
చలియించి మందరాచలము తిరిగె
గాంభీర్యమెల్ల నీ కడన యుండుటఁజేసి
కాకుత్స్థునకు వార్ధి కట్టుబడియె
జయలక్ష్మి నీ యురస్థలినే యుండుటఁజేసి
హరిపోయి బలి దానమడుగు కొనియె
ఆకారమెల్ల నీయందె యుండుటఁజేసి
మరుడు చిచ్చునఁబడి మడిసి చనియె

తిక్కదండనాథ దేవేంద్రప్పరికి నీ
వదుగు తెరిగి: సగము తిరుగుటుడుగు
అద్ధి కట్టువిడుచు అచ్యుతు కొదమాను
మరుదు మరలంగలుగు మగల రాజు.

వీరపత్ని చానమ్మ సహగమనము సలిపి భర్త ననుగమించినది.

కాటమరాజుకథ, పలనాటివీరకథ, బొబ్బిలికథ బుర్రకథలుగా ఆంధ్ర దేశమున ప్రచారములో నున్నవి.

తెలుగువారి వీరరసాభినివేశమునకు పరాక్రమ ప్రాభవములకు పుంఖాను పుంఖములుగా నిదర్శనముల నెన్నవచ్చును. ఓరుగల్లు పతనానంతరము స్వాతంత్ర్యమును పునరుద్ధరించిన మల్లారెడ్డి ప్రభృతులైన వీరులనుండి దక్షిణభారతమున తంజావూరు మధుర నాయకరాజ్యములు స్థాపించిన ఆంధ్ర పరాక్రమ ప్రాభవములు దక్షిణాపథ చరిత్రకు సుపరిచితములు.

అధునాతన చరిత్రకు వార్తిక ప్రాయమైన ఒకపరిహాస విజల్పితమును సింహావలోకన ప్రాయముగా నుటంకించవచ్చును. ఆంగ్లేయుడైన రూథర్‌ఫర్డ్ దొర ఆంధ్రదేశములో కోయల మన్యములలో పనిచేసిన ఉన్నతోద్యోగి: ఢిల్లీలో ఒక పాఠశాల వార్షికోత్సవమున బహుమతి నిర్ణేతగా వెడలెనట. స్వాతంత్ర్యోదయమునకు ముందు ఆనాడు అతడు అడిగిన ప్రశ్న :-

సిపాయిల తిరుగుబాటు విఫలమౌటకు ముఖ్యకారణము ఏది "

ఒక తమిళ బాలుడు తనకు ఆ తిరుగుబాటుసంగతి తెలియదనెను.

ఒక మహారాష్ట్ర బాలుడు దురదృష్టవశాత్తు నిర్ణీతదినమునకు పదిరోజుల ముందే తిరుగబడిన పాండే తొందరపాటువలన ఆంగ్లేయులు సకాలములో మేల్కొనగల్గుట అని వివరించినాడు.

ఒక సిక్కుబాలుడు "సిక్కులు ఆ తిరుగుబాటుతో చేరకపోవుట అని వివరించినాడు.

ఒక ముస్లిము బాలుడు "మొగలు చక్రవర్తి షా ఆలం ప్రభువు ముసలి వాడయి ముందంజ వేయలేకపోవుట" అని చెప్పినాడు.

ఒక బెంగాలు బాలుడు అసలు "సిపాయిల తిరుగుబాటు" అనీ అనుట పొరపాటు అది భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామారంభము. అది విఫలము కాలేదు. అది ఇంకను కొనసాగుచునే యున్నది. సఫలమగు సమయము సమీపించుచున్నది అని ప్రవచించినాడు.

ఆంధ్ర బాలుడు "అనాటికి అల్లూరి సీతారామరాజు ఆంధ్రదేశములో అవిర్భవించక పోవుట" అని గర్జించినాడు.

రూథర్‌ఫర్డ్ దొర ప్రథమ బహుమతి ఆంధ్రబాలునికి లభింపవలెనని తీర్పు చెప్పినాడట.

వీరరసముయొక్క విశ్వరూప ప్రదర్శనము సాక్షాత్కరించు విజ్ఞాన సర్వస్వము భారతము ఆంధ్రులకు ప్రథమ ప్రధానగ్రంథమైనది. దేశము అన్యాక్రాంతమైపోకుండ-సనాతన సంస్కృతిని సంరక్షించుకొను ఆపత్కాలముల తరించుటకై సంస్కృత మహాభారతము అవతరించినది. ప్రజలను లోకోత్తర ధర్మవీరులుగ క్రియాశూరులుగా రూపొందించుటయే సంస్కృత భారత గ్రంథ ధ్యేయము. తెలుగులో రాజరాజ నరేంద్రుడు నన్నయభట్టును భారతమును రచింపుమని కోరిన సమయముకూడ అట్టిదే. అతని తండ్రి విమలాదిత్యుడు జైనమత గురువునకు ఇచ్చిన దానశాసనమునుబట్టి అలనాడు జైనమత ప్రాబల్యము నూహింపవచ్చును. తిక్కన మహాకవి ఓరుగల్లులో గణపతిదేవ చక్రవర్తిని సందర్శించినపుడు – ఆతడు జైనమతస్థులతో వాదించి వారిని జయించినట్లు సోమదేవరాజీయ కథనము.

అనుమకొండ నివాసులైనట్టి బౌద్ధ
జనుల రావించి వారిఁ దిక్కనమనీషి
తోడ వాదింపఁజేసినఁ దొడరివారిఁ
ఘులకనగా సోమయాజులు గెలుచుటయును

అని ఆ గ్రంథమునందున్నది.

భారతము వీరరస ప్రధానమైన మహాగ్రంథము "జగద్ధితమైన రచన" వీరరసమునకు రాజనీతి పునాది. తిక్కన మహాకవి మహామంత్రి. కేతన వర్ణించినట్లు అతడు

అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు
చామరములు జమిలి శంఖములును
గంటకట్లు భూమి కానికగాఁ బెం
పెసగు రాచపదవులెల్లఁబడసె.

అట్టి తిక్కన మహాకవి మహాభారతములో ప్రస్తరించిన రాజనీతి ఆంధ్రులకు వెన్నతో పెట్టిన విద్యయగుట ఆంధ్రుల అదృష్టవిశేషము.

ఆంధ్రమహాభారతములోని నీతిపద్యములు ఆంధ్ర సంస్కృతిలో పడుగు పేకగ కలిసి అల్లిబిల్లిగ లీనమై తెలుగువారి దినచర్యను తీర్చిదిద్దుచున్నవి.

ఒరు లేయవి యొనరించిన
నరవర అప్రియము తన మనంబున కగు తా
న్నొరులకు అవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్.

అను భారత నీతిబోధ ఆంధ్రపత్రికకు నిత్యశీర్షిక యైనది.

ధనమును విద్యయు వంశం
బును దుర్మతులకు మదంబు పొనరించును స
జ్జనులైన వారి కడకువ
యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా!

పరుల ధనమునకు విద్యా
పరిణతికిన్ తేజమునకు బలమునకు మనం
బెరియగ అసహ్యపడు అ
న్నరుడు తెవులు లేని వేదనంబడు అధిపా.

మున్నగు భారతసూక్తులు ఆంధ్రసంస్కృతిలో అంతర్లీనములైన నీతులు.

భారతము ఆంధ్రుల ప్రధానగ్రంథము. భాగవతము ఆంధ్రుల అభిమాన గ్రంథము. భారత భాగవతములు రెండును వ్యాసప్రోక్తములే. జ్ఞానయోగము కర్మయోగమునకు పునాది. మహామేధావి క్రియాశూరుడై ప్రయోజకుడుకావచ్చు. కాని అట్టివానికి ఆత్మశాంతి లభించునా? అనునది ప్రశ్న. పంచమవేదమైన భార

తము అష్టాదశ పురాణములు రచించిన వ్యాసునకే కేవల జ్ఞానయోగము చిత్త శాంతిని ప్రసాదించలేక పోయెనట!

"ధాతవు భారతశ్రుతి విధాతవు వేదపదార్థ జాల వి
జ్ఞాతవు కామముఖ్య రిపుషట్క విజేతవు బ్రహ్మతత్త్వ ని
ర్ణేతవు యోగినేతవు వినీతుడ వీవు చలించి చెల్లరే
కాతరు కైవడిన్ వగవ కారణమేమి పరాశరాత్మజా."

భాగవతములోని పద్యము ఇట అనుసంధేయము.

ఐహిక జగత్తులో మిట్టపల్లముల నధిగమించి ప్రవహించి తుట్టతుదకు సముద్రమునుచేరు మహానదివలె జీవాత్మ చిట్టచివరకు పరమాత్మను చేరుకొనుటకు "భక్తి" మార్గమే శరణ్యమని భాగవత ప్రబోధము. జ్ఞానయోగులు కర్మవీరులు అవశ్యము చేరవలసిన చరమయోగము భక్తి. సంస్కృత భాగవతము యావత్ భారతదేశమున వహించిన ప్రభావము వేరు - ఆంధ్ర మహాభాగవతమే ఆంధ్ర ప్రజాహృదయములపై నెరపిన ప్రభుత్వమువేరు. ఆంధ్ర భాగవతము తెలుగులో పోతన మహాకవి పునఃసృష్టి. యథార్థమునకు భారత భాగవతములు ఆంధ్ర సంస్కృతి ప్రపంచములో చలామణి యగుచున్న ఒకే బంగారు నాణెమునకు బొమ్మ బొరుసులవంటివి. వీరము భక్తి భిన్నములుగా ఉద్భవించవచ్చును. శైవము ముదిరిన వీరశైవమైనది. అట్లే వీరవైష్ణవము. భక్తికిని వీరమునకు ఆవేశము పునాది. ఆత్మార్పణము ధ్యేయము.

"లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరమ్యంబు మం
జులతాశోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమును సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాల వాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై"

అని పోతన మహాకవి ప్రవచించినాడు.

'భాగవతమ్ము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన
విబుధ జనులవలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపరతు'

అని ఎంత వినయముతో పలికినాడో పోతన మహాకవి!

అంతేగాక - పోతన నిరాడంబర నిష్కల్మషజీవితము గడిపిన నిరుపేదగా - "ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులు" గైకొనగోరని మహానుభావుడుగా తెలుగువారికి చిరపరిచితుడు. పోతనలో తెలుగుదనము రాశీభూతమైనదనిపించును. ఆంధ్రుల స్వాభిమానపూరితమైన ఆవేశము, ఆదర్శప్రేరితత్వము ఆ మహాకవి వ్యక్తిత్వములో మూర్తీభవించినవి.

తెలుగు కవితకు ఆద్యప్రకృతులైన యతిప్రాసలు పోతన కవితాగానమునకు మృదంగవ్యాపారము నిర్వర్తించుచున్నవి.

'హరికి-నందగోకుల విహారికి-చక్రసమీర దైత్యసంహారికి
గోపనితంబినీ మనోహారికి... అని

స్వస్తి జగత్త్రయీభువన శాసనకర్తకు; హాసమాత్ర వి
ధ్వస్తనిలింప భర్తకు ఉదారపద వ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధానవిహర్తకు నిర్జరీగళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోకభర్తకున్.

అని పోతనయే అనగలడు.

అచ్చపుఁ జీకటిం బడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచు పుట్టుచున్ మరల చర్విత చర్వణులైన వారికిన్
జెచ్చెర వుట్టునే పరులు సెప్పినసైన నిజేచ్ఛనైన ఏ
మిచ్చిననైన కానలకు ఏగిననైన; హరి ప్రబోధముల్.

అని శ్లేష్మములో బడిన ఈగలవలె సంసారబద్ధులైన జీవులకు తరణోపాయమును ఉపదేశించుటకు ఉద్యుక్తుడైన కవి పోతన.

మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలదూగు
రాయంచ చనునె తరంగిణులకు
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక
మరుగునే సాంద్ర నీహారములకు

అంబుజోదర దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబు చేరనేర్చు
వినుత గుణశీల మాటలు వేయునేల?

వైరాగ్యముగా పరిణమించిన ఆత్మార్పణమే నిజమైనభక్తి. ప్రహ్లాదుడు పంచభూతములపై ప్రభుత్వము నెరపగల శక్తిమంతుడైన ప్రభువు హిరణ్యకశిపునకు చేసిన ప్రబోధము నేటి నవనాగరికతకు చేసిన ప్రబోధమే అనిపించును.

లోకము లన్నియున్ గడియలోన జయించిన వాడ వింద్రియా
నీకము చిత్తమున్ గెలువనేరవు; నిన్ను నిబద్ధుఁజేయు నీ
భీకర శత్రు లార్వుర ప్రభిన్నులఁ జేసిన భూతకోటిలో
నీకు విరోధి లేడొకడు నేర్పున జూడుము దానవేశ్వరా.

నిరుపేదయైన పోతన తన పూరిగుడిసెనే మహారాజ ప్రాసాదముగా భావించిన మహానుభావుడు.

తిక్కన మహామంత్రియై తాను నివసించిన మహాప్రాసాదమును ఒక పూరిగుడిసెగా భావించిన మహానుభావుడు.

భారత భాగవతములతోపాటు ఆంధ్ర సంస్కృతిపై చెరగని ప్రభావ ముద్రవేసిన రచనలు ఎన్నో ఉన్నవి. వేమన నీతిపద్యములు, సుమతి శతక పద్యములు, భాస్కర శతకము, ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర శతకము, మరియు అనేక గ్రంథములలోని పద్యములు ఉదహరింపనగును. ఆంధ్రులకు ఏ వొక్కడు నిజమైన అభిమానకవి అని చెప్పలేము. అభిమాన రచనలు అనేకములున్నవి.

నీటిలోన మొసలి నిగిడి యేనుగులాగు
బయట కుక్కచేత భంగపడును
స్థానబలిమికాని తనబల్మికాదయా
విశ్వదాభిరామ వినురవేమ.

ఉప్పు కప్పురంబు ఒక్కపోలికనుండు
చూడచూడ రుచుల జాడవేరు

పురుషులందు పుణ్యపురుషులు వేరయా
విశ్వదాభిరామ వినురవేమ.

అల్పుడెపుడు పలుకు ఆడంబరముగాను
సజ్జనుండు పలుకు చల్లగాను
కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా
విశ్వదాభిరామ వినురవేమ.

తెలుగు వెలుగును దేదీప్యమానముచేసిన కిరణములలో విశ్వదాభిరామ వినురవేమ లకుగల సముచితస్థానము సహృదయవేద్యము.

మహాభారతము పధునెనిమిది పర్వములు సాంగోపాంగముగా చదువవలెను. ఒకవేళ చదువలేనివారు సుమతి శతకము చదివిన చాలుననిపించును.

బలవంతుడ నాకేమని
పలువురతో నిగ్రహించి పలుకుట మేలా
బలవంతమైన సర్పము
చలిచీమల చేతచిక్కి చావదె సుమతీ!

ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగా
అపకారికి ఉపకారము
నెపమెన్నక చేయువాడు నేర్పరి సుమతీ!

కనకపు సింహాసనమున
శునకము కూర్చుండబెట్టి శుభలగ్నమునం
దొనరగ బట్టము గట్టిన
వెనుకటి గుణమేల మాను వినరా సుమతీ.

కమలములు నీటబాసిన
కమలాప్తుని రశ్మిసోకి కమలిన భంగిన్
తమ తమ నెలవులు తప్పిన
తమ మిత్రులె శత్రులగుట తధ్యము సుమతీ.

సిరిదా వచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ సలిలము భంగిన్
సిరిదా బోయిన బోవును
కరి మ్రింగిన వెలగపండు కరణిన్ సుమతీ..

మున్నగు పద్యములు నీతులు మాత్రమేగాదు. అవి నిత్యజీవితముతోని శాశ్వత సత్యములు.

చదువది యెంత గల్గిన రసజ్ఞత యించుక చాలకున్న ఆ
చదువు నిరర్థకంబు గుణసంయుతు లెవ్వరు మెచ్చ రెచ్చటన్
పదనుగ మంచికూర నలపాకము చేసిననైన అందు విం
పొదవెడు ఉప్పులేక రుచి పుట్టగ నేర్చు నటయ్య. భాస్కరా.

విజ్ఞానము వేరు రసజ్ఞత వేరు. రసజ్ఞతపై ఆంధ్ర సంస్కృతి నిలిపిన నిష్ఠ గమనింపదగినది.

పండితులైనవారు దిగువంబడి యుండగ అల్పు డొక్క డు
ద్దండత పీఠమెక్కిన బుధ ప్రకరంబులకేమి యెగ్గగున్
కొండొక కోతి చెట్టుకొన కొమ్మల నుండగ క్రింద గండ భే
రుండ మదేభ సింహ నికురుంబములుండవె చేరి భాస్కరా.

శతకములలోని సునిశిత సమ్యక్‌దృష్టి తెలుగు సంస్కృతికి మనోనేత్రమును ప్రసాదించుచున్నది.

కలిమి గల లోభికన్నను
విలసితముగ పేదమేలు వితరణి యైనన్
చలి చలమ మేలుగాదా
కులనిధి యంభోధికన్న గుప్పలదెన్నా.

సర్వతంత్ర స్వతంత్రుడైన తెలుగుకవి సదా ప్రగతిశీలియే. ఒక "తెలుగు పువ్వు" కోరిన కోరిక ఉదాహరింపనగును.

"ఈ సుమజన్మమెట్లొ ఘటియిల్లెను నాకొక పాటిదై"

అని ఒక పువ్వు సంతోషించినది. తన జన్మసాఫల్యముకై

"పేదల రక్తమాంసముల పెంపువహించి దయాసుధారసా
స్వాదదరిద్రులైన ధనవంతుల పెద్దరికమ్మకై మతో
న్మాదము పెంచు దేవునకు మూరుగ నిల్చిన రాతిబొమ్మలం
దూదరవోవు పాడుబ్రదుకొక్క నిమేషము సైప నాహృదిన్"

అని పరితపించినది.

ద్వారతోరణాస్థానమునం దురింబరగజాలను...
నాకు తలంపులేదు లలనాజనతాకబరీభరై కభూషాకలనన్

అని వేడినిట్టూరుపు విడిచినది.

ఆ పూవు కోరిన కమ్మని కోరిక :

నీచపు దాస్యవృత్తి మననేరని శూరత మాతృదేశసే
వాచరణమ్మునం దసువు లర్పణ చేసినవారి పార్థివ
శ్రీ తెలువారుచోట తదస్ప్రగుచులన్ వికసించి వాసనల్
వీచుచు వాడిపోవగవలెన్ తదుదాత్త సమాధిమృత్తికన్

—శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి

దేశభక్తుల సమాధిమట్టితోపాటు కలిసిపోవుటయే తనజన్మకు ధన్యత్వమని ఆ పూవు కోరిక.

యుగధర్మమునుబట్టి అభిరుచులు మారుచుండుట సహజము. ఏది ఉత్తమ సంస్కృతి? ఏది ఉత్తమ సాహిత్యము? అను ప్రశ్నకు లోకో భిన్న రుచిః అనియే సమాధానము చెప్పవలసివచ్చును. అయినను ఏ రచన మానవ హృదయమును కరగించి, మానవత్వమును పెంపొందింపచేయునో ఆ రచన ఉత్తమ సంస్కృతికి చెందినదని చెప్పట అధికసంఖ్యాకులు ఆమోదించు సమాధానము.

ఒక రచన మానవుని దానవునిగా మార్చగూడదని తీర్పుచెప్పటకాదు. ఆ దానవత్వము జగద్ధితముగా నవయుగోదయమునకై ఆరాధింపవచ్చునని వాదించువారుండవచ్చును.

"End justifies the means"-ఉత్తమ లక్ష్యసాధనకై ఏ సాధన ములనైన వాడవచ్చునను వాదము క్రొత్తదికాదు. స్వాతంత్ర సముపార్జనకు అహింసామార్గమేగాక ధర్మయుద్ధము గర్హించపదగినదికాదు అనునది, అనుభవ సిద్ధము. గాంధీమహాత్ముడు-లక్ష్యము పవిత్రమైయుండుటేగాక లక్ష్యసాధన మార్గములుగూడ పవిత్రములుగనే యుండవలెనని ప్రతిపాదించినాడు.

సాహిత్యము-సంస్కృతి సంఘసంస్కరణకు ఉత్తమోత్తమసాధనములు. మానవ హృదయాలపై సాహిత్యమునకు సంస్కృతికి అనిర్వచనీయమైన పరోక్ష శక్తియున్నది. అందుచే నవ్యయుగోదయమునకు రచయితలు వైతాళికులు. "Poets are the unrecognised legislators of the world" "ప్రపంచములో అజ్ఞాత శాసనకర్తలు కవులే" అని షెల్లీ ప్రవచించినాడు.

సామ్యవాద జగత్తునకు వైతాళిక గీతిక "రోడ్డురోలరు" గేయమ్ము వ్రాసిన శ్రీ కొనకళ్ల వేంకటరత్నము సంఘములో ఒకానొక 'అజ్ఞాత' గుమాస్తా.

లాగరా హయిలెస్స లాగరా
రోడ్డురోలరు ముందడుగై లాగరా। హయిలెస్స లాగరా।
నడినెత్తిన సూరీడూ నకనక లాడించేడు
కంకర రస్తాలో సగమింకా మిగిలున్నదిరా ॥ లాగరా
గోదావరి వరదలొచ్చి గోలగున్నదంట ఈడ
కట్టసుకాలినడానికి గవినే రొస్తాదంట ॥ లాగరా
మారువాడి అప్పుకంటె మాయదారి బ్రతుకుకంటె
బరువా ఇంతోటి పెద్దబండరాయి మామయ్య ॥ లాగరా
లచ్చలున్న షావుకారు లాభాలను మోసేందుకు
భారీ యాపారములో లారీ కొన్నాడంట ॥ లాగరా
మట్టిచెట్టు ఊడనీడ మనిషిపురుగు లేనికాడ
సనుబాలకు కక్కటిల్లి సంటోడేడుస్తుంటాడు ॥ లాగరా
పొలముపుట్ట అమ్ముకొని పొట్టసేత బట్టుకొని
వలసపోయ్యిం దీదారినె పంటకాపు పట్నానికి ॥ లాగరా.

"కార్మికుడు పూజ్యుడు" అనే భావముతోపాటు, సమాజములో అధఃపతనము చెంది ఉదయమునుండి సాయంకాలము వరకు చెమటోడ్చి శ్రమించి పనిచేయు కూలివారిపై సానుభూతికలిగి సహృదయుల హృదయము కరగుట యీరచనకు ధ్యేయము. రచయిత కృతార్థుడైనట్లు ఎంచుటకు సహృదయులే ప్రమాణము.

రచయిత సంఘసంస్కర్తకు, రాజకీయ విప్లవనాయకునకు పూర్వరంగ ప్రవర్తకుడైన సూత్రధారి.

ఆంధ్రసంస్కృతిలో నన్నయనుండి శ్రీ కందుకూరి వీరేశలింగముగారి వరకు, శ్రీ వీరేశలింగముగారినుండి అత్యధునాతన దిగంబరపైగంబర కవుల వరకు ఆంధ్రసాహిత్యము జగద్ధితమైన భూమికను నిర్వహించినది. కవి అను పదమును విస్తృతార్థములో స్వీకరింపదగును అప్పుడు రచయితలందరు కవులే. కథానికలు - నవలలు - గేయములు - ఖండకావ్యములు - నాటకములు - ఏకాంకికలు - చిత్రలేఖనములు - శిల్పములు - లలితకళలన్నియు మానవహృదయమును ద్రవింప జేయుటకు ఉపకరించుచుండును. ఒకానొకప్పుడు పురోగామియైన భావవిప్లవము వెనువెంట హింసాజర్జరితమైన విప్లవము చెలరేగవచ్చును. అయినను - ఆ సంఘటన లన్నియు నూత్నయుగోదయమునకై భూదేవి అవశ్యము అనుభవించవలసిన ప్రసవవేదనలే అని మేధావులు ప్రతిపాదించుచున్న వేదాంతము.

# ఆంధ్రసంస్కృతి-లలితకళలు

నాగరకతాజగత్తు కవిత్వము, గానము, చిత్రలేఖనము, శిల్పము, నాట్యము అను కళలను లలితకళలుగా పరిగణించుచున్నది. మానవ జీవితమును, సుఖతరము, సుందరతరము చేయునవి అన్నియు కళలే. వనచరుడుగా శాఖామృగముగా నున్న ఆటవికుడు, నేడు నవనాగరకుడై పంచభూతములను శాసించి ప్రకృతిని జయించి సృష్టికి ప్రతిసృష్టి చేయు శక్తి సంపాదించి చంద్రమండలోపరితలము నధివసించి రోదసీ విజయము సాధించుచున్న ఈ సమయమువరకు చేసిన కృషియంతయు కళయే. ఇవి ఒకనాడు చతుఃషష్టి కళలుగా పేరెన్నిక గాంచవచ్చు. ఈనాడు సహస్రషష్టి కళలు గావచ్చు, రేపు శతసహస్రషష్టి కళలుగా రూపొందవచ్చు. నాగరకతాభ్యున్నతి కి కళలు కొలమానములు. సామాన్య కళలందు ప్రయోజనము ప్రాధాన్యమువహించును. లలితకళలందు సౌందర్యము ప్రాధాన్యము వహించును. ప్రాక్తన మానవుడు నీటను నిలువచేయ, రాతిని మలచి ఒక తొట్టిగా చెక్కినప్పుడు అది సామాన్యకళ. ఆ రాతినే ఒక విగ్రహముగా చెక్కినచో అది లలితకళ. కూర్చొనుటకై ఒక కుర్చీ తయారుచేయుట ఒక కళ. అందు సౌందర్యము గౌణము; ప్రయోజనము ప్రధానమైనది. ఆ దారువుతో-ఒక సరస్వతీ విగ్రహమును చెక్కినచో లలితకళయైన దారుశిల్పముగా ప్రస్తుతించుచున్నాము.

కళల పట్టిక నాగరకదేశములందు ఎల్లప్పుడును ఒక అకృతిగణమే.

కాని-యుగయుగాంతరములనుండి యావత్ప్రపంచమున లలితకళలు మాత్రము నాటికి నేటికి కవిత్వము, చిత్రలేఖనము, శిల్పము, నాట్యము అనునవి మాత్రమే నిబద్ధగణముగ నిలిచియున్నవి.

లలితకళలకు అంతరాత్మ సౌందర్యారాధన. "A thing of beauty is a joy forever"-సుందర వస్తుసందర్శనము శాశ్వతానందసంధాయకమని ఆంగ్లకవి కీట్సు అభిభాషితము.

ఆంధ్రుల సౌందర్యారాధన అప్రతిమానము. నేటికిగూడ తెలుగునేల నాలుగుచెరగులలో ఏ మారుమూల పల్లెటూరి గుడిసెముందైన తెల్లవారగనే ముచ్చటగొలుపు ముగ్గులు కనులపండువుగ వికసించుచుండును. అవి ఆంధ్ర కవితాజగత్తులో "కస్తూరి కలయంపి జల్లులై ముత్యాల ముగ్గులై" వెల్లివిరిసినవి. ఆంధ్ర భూగోళ నైసర్గిక పరిస్థితులు, సారస్వతము, చరిత్ర తెలుగువారిని స్వభావసిద్ధముగ సౌందర్యోపాసకులుగ తీర్చిదిద్దినవి. ఆంధ్రదేశములోని సూర్యోదయ సూర్యాస్తమయములు, కదలికెరటములు, ఆర్తవశోభావైభవము, అడవులు కొండలు, నదీనదములు, ఫలపుష్పతరులతాగుల్మములు, పక్షిజంతు సంతానవితానములు, సహజప్రకృతి సౌందర్య సంపన్నమైన భౌగోళిక సౌభాగ్యము ఆంధ్రులను ఆదర్శరసికులుగా ఆజన్మ సౌందర్యలాలసులుగా తీర్చిదిద్దినవి.

శిల్పము తొలి లలితకళ. మూడుకొలతలున్న మొదటి లలితకళ.

చిత్రలేఖనము రెండుకొలతలున్న రెండవ కళ.

గానము పదార్థ సాహాయ్య మపేక్షించని లలితకళ.

లలితకళ లన్నియు మానవ మానస సంసృష్టులే. కాని శిల్పములో ఆ మానసిక సృష్టికి శిల మూలప్రకృతి చిత్రలేఖనమునకు రంగులు భిత్తిక మూల ప్రకృతులు. గానము స్వచ్ఛ మానసిక సంసృష్టియైనను దానికి నాదము మూల ప్రకృతి. కవిత కేవలము మానస సృష్టి. కవితకు మూలప్రకృతి యనదగిన వాక్కు, భాషాపదములు మనోభిప్రాయములకు ప్రతీక మాత్రములే. నాట్యము లలితకళలలో ఒకటిగా వన్నెకెక్కినను అది శిల్ప, చిత్రలేఖన, గాన, కవితా కళల సమాహారమే.

లలితకళ లన్నిటిలో ఆంధ్ర సంస్కృతి అధిష్ఠించిన ఉన్నత శిఖరములు జగజ్జేగీయమానములు.

ఆంధ్రదేశమున వర్ధిల్లిన లలితకళలను అనుశీలించునప్పుడు మూడు ముఖ్య విషయములను మనసులో పెట్టుకొనవలసి యున్నది.

1. ఆంధ్రదేశ భౌగోళిక స్థితి

2. ఆంధ్ర చరిత్ర.

3. ఆంధ్రదేశమున వర్ధిల్లిన వివిధ మతములు.

1. లలితకళలందును-భారత భూభాగమున ఆంధ్రదేశము ఉత్తర దక్షిణ ములకు ప్రాక్ పశ్చిమములకు సంగమస్థానమైన సమన్వయక్షేత్రమై విలసిల్లినది.

2. అంతేగాక సుదీర్ఘమైన తీరరేఖయుండుటవలన చరిత్రోదయమునుండి నేటివరకు విదేశములనుండి యేర్పడిన వర్తకవ్యాపార మార్గములతోపాటు-కళో పాసనలోగూడ విశ్వ పరివ్యాప్తములైన రహదారులు ఏర్పడినవి. తత్ఫలితముగా ఆంధ్రుల కళాసృష్టిలో అసహన దూరమైన ఒకానొక సమరసభావము-స్వభావ సిద్ధముగ స్వయంవ్యక్త మగుచుండును. అందుచేత "ఆంధ్ర సంస్కృతి ఇచ్చి పుచ్చుకొనుటలో గడితేరినది. తెలుగు గడ్డలో వివిధ జాతులు; వివిధ నాగరిక తలు ఒరసికొని కలిసి మెలిసి పోయినవి. మొదట శక యవన పల్లవులు పిమ్మట అరబ్బీ పారసీ మొగలాయీలు తుదకు ఐరోపియనులువచ్చిరి. వారితో పాటు వారిభాషలు వాఙ్మయములు కళలును-ఇచటికి వలస వచ్చినవి. అవి యన్నియు-మథనముకాగా ఉత్పత్తియైన అమృతసారమే ఆంధ్రసంస్కృతి".

'సహనమే సంస్కృతి" యని శ్రీ రాధాకృష్ణ మనీషి ప్రవచనము. "Cross fertilization of cultures" సంస్కృతి పరపరాగ సమ్మేళ నము ప్రపంచచరిత్రకు ప్రగతిమార్గము తీర్చిదిద్దినట్లు మేధావుల సిద్ధాంతము. సాంస్కృతిక పరపరాగ సమ్మేళనమునకు చరిత్రలో తెలుగుగడ్డ గురుత్వాకర్షణ గరిమనాభి. ఈ సాంస్కృతిక పరపరాగ సంపర్కము సాధించిన సమన్వయము నకు సహనమునకు సమరసభావమునకు ఆంధ్రదేశము ఉగ్గడింపదగినది. అప్పు డప్పుడు ఈగుణములే "ఆంధ్రులు అనుకరణశీలురు" అను అపప్రథ యేర్పడు టకు దారితీసినవి; ఆదికవియైన నన్నయభట్టు ఆంధ్రమహాభారతమును సంస్కృత శ్లోకముతో ఆరంభించినాడు. తిక్కన-ఉభయకవిమిత్ర బిరుదాంకితుడై ఆంధ్ర భాషలో భారతము వ్రాసినను, సంస్కృతకవులకు ఆప్తమిత్రుడై యుండెను. ఆంధ్రులు అలనాడు సంస్కృతమును, నేడు ఆంగ్లమును ఆదరించినట్లే రేపు హిందీనిగూడ అభినివేశముతో అధ్యయనము చేయుట అవశ్యకర్తవ్యము;

శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్, "కళాప్రపూర్ణ ద్వారము వేంకటస్వామి నాయుడు గారు పాశ్చాత్య ఋంత్రగాన పరికరమైన వాయులీన విద్యలో పరాకాష్ఠ కెక్కిన ప్రాచ్య సంగీతవిద్వాంసుడు"[1] అని ప్రశంసించెను. శ్రీ రాధాకృష్ణన్–మాతృభాష అంగ్లమైన విద్వాంసులను మించిన అంగ్లపాండిత్యము నార్జించిన ఆంధ్ర విద్యాసార్వభౌముడుగా విశ్వవిఖ్యాతి నార్జించినవాడు.

ఆంధ్ర విద్వాంసులు తరతరాలుగా సంస్కృత విద్యలోనేగాక అనేక విదేశ విద్యలలో అభినివేశమును ఆర్జించిన పండితులు. బెండపూడి అన్నమ మంత్రినిగూర్చి శ్రీనాధుని ప్రశంస ఉదాహరణప్రాయమైనది.

అరబీభాష తురుష్కభాష గజకర్ణాటాంధ్ర గాంధార ఘూ
ర్జరభాషల్ మళయాళభాష శకభాషాసింధుసౌవీర బ
ర్బరభాషల్ కరహాటభాష మరియుం భాషావిశేషంబు ల
త్ఫెరువై వచ్చు నరేటి అన్ననికి గోష్ఠీసంప్రయోగంబులన్.

—భీమఖండము–అవతారిక.

అంగ్ల సంస్కృతికి అంధ్రభూమి స్వాగతముచెప్పి, తనలో లీనము చేసికొనినట్లుగా అటు ఉత్తర భారతముగాని ఇటు దక్షిణభారతముగాని చేసికోలేదు.

8. ప్రాచీన కాలమునుండి లలితకళలు మతముతో అవినాభావ సంబంధమును పెంపొందించుకొని వర్థిల్లిన సంగతి చరిత్ర కర్తలకు అనారూఢ విషయము గాదు, చరిత్రోదయము నుండి అంధ్రదేశమునందును ప్రాథమిక కళగా నెన్నదగు శిల్పము వైదికమతములో ముడివడి కన్పించుచున్నది. అంధ్రదేశమున శిల్పము "ప్రౌఢ నిర్భరవయఃపరిపాకము"తో విలసిల్లినది బౌద్ధయుగమునందే. ఉత్తరాపథమున బౌద్ధము విలసిల్లినను శిల్పకళకు దోహదము కల్పించలేదు. విగ్రహ ప్రతిష్ఠ ప్రాచీన బౌద్ధము నిరసించినది. బౌద్ధమునకు సౌందర్యోపాసన నేర్పినది అంధ్రభూమి. బుద్ధుని ఆకారమునకు బదులు శ్రీపాద ద్వయము ప్రబోధమునకు ధర్మచక్రమును బౌద్ధవాస్తు శిల్పమున చిరకాలము ప్రతీక.

1. Kalaprapurna Sri Dwaram Venkata Swami Naidu is the Eastern master of the western musical instrument-the violin.

లుగా నిలిచి శిల్పము మీర రాని మూడు గీతలైనవి. బౌద్ధములో శ్రోత్రియులైన హీనయానమువారు లలితకళోపాసనను ప్రోత్సహించలేదు. మహాయానము ఎప్పుడు ఎచట ఉద్భవించినప్పటికి, అభ్యుదయ పరంపరాభివృద్ధితో అధిగమించినది ఆంధ్రభూమియందే. అశోకచక్రవర్తి కాలమున బౌద్ధులలోగల వివిధ సిద్ధాంతములను సమన్వయము జరుపుటకు జరిగిన (తృతీయ) సంగీతిలో[1] బౌద్ధులు మహాస్థవిరులు మహాసాంఘికులుగా విడిపోయినారు. శ్రోత్రియులైన మహాస్థవిరులు సంగీతిసభనుండి నిష్క్రమించుట మాత్రమేగాక మగధను విడిచి పోయినారట. అధిక సంఖ్యాకులైన మహాసాంఘికులు అశోకుని కాలమున మగధనుండి బౌద్ధమును విశ్వపరివ్యాప్త మతముగా వెల్లివిరియ చేసినారు. మౌర్య వంశము అంతరించగానే బౌద్ధమునకే మగధలో నిలువనీడ లేకపోయినది. పుష్యమిత్రుడు యజ్ఞయాగాదులను పునరుద్ధరించి సనాతన వైదికమత పునరుద్ధరణకు పూనుకొనుటచే మగధలోని మహాసాంఘికులు ఆంధ్రదేశమునకు వలసవచ్చినారు. అప్పటికే అశోకునకు సమకాలీనుడైన మహాదేవస్థవిరుడు స్థాపించిన చైత్య బౌద్ధము విరాజిల్లుచున్నది. అసలు బుద్ధభగవానుడు స్థాపించిన బౌద్ధము శరీరమును శుష్కింపచేయు తపశ్చర్యను నిరసించి 'మధ్యేమార్గము' ఉత్తమమని ప్రవచించియున్నాడు. అయితే అతడు ఆ మధ్యేమార్గమును నిర్వచింపలేదు. ఈ తాత్త్విక చర్యకు పూనుకొనినవారిలో అగ్రగణ్యుడు, అపర బుద్ధభగవానుడుగా ప్రశస్తికెక్కిన నాగార్జునాచార్యుడు. శ్రీమన్నాగార్జునాచార్యులవారు నివసించిన కొండకు నేటికి ఆంధ్రదేశమున నాగార్జునుని కొండ అని పేరు.

నాగార్జునాచార్యులు మాధ్యమిక వాద ప్రవక్త. భాష్యకర్త.

"అస్తి నాస్తి తదుభయానుభయ చతుష్కోటి వినిర్ముక్తం శూన్యరూపమ్". ప్రపంచపు అస్తిత్వమునకును అనస్తిత్వమునకును శాశ్వతత్వమునకును అశాశ్వతత్వమునకును మధ్యేమార్గము ప్రతిపాదించి తపోవాసక్లేశములచేత శరీరమును శోషింపజేయుట, భోగలాలసత్వముతో జీవితమును నిరర్థకము

---

[1] బుద్ధుని మహాపరి నిర్వాణానంతరము రాజగృహములో జరిగినది ప్రథమ సంగీతి. అటుపిమ్మట రాజగృహములో వందసవత్సరాలు పిమ్మట జరిగినది ద్వితీయ సంగీతి. అశోకుని కాలమున జరిగినది తృతీయ సంగీతి.

కనిష్కుని కాలమున క్రీ. శ. ప్రథమశతాబ్దిలో జరిగినది చతుర్థ సంగీతి.

జేయుట అను విప్రతిపన్నములైన సిద్ధాంతములకు మధ్యేమార్గమును బోధించిన బుద్ధుని అవబోధకు శ్రీ నాగార్జునాచార్యులవారి మాధ్యమిక వాదము ఒక శ్రీ భాష్యము నిర్వాణ సిద్ధి అయిన పిదప బోధిసత్త్వుని చిత్తము "శూన్య"ముగా పర్యవసించునని నాగార్జునాచార్యుల సిద్ధాంతము. నాగార్జునాచార్యులవారి శూన్య వాదములోని శూన్యము "కేవల శూన్యము" గాదని అట్లయిన అది అభావముతో సమానమగుననియు అందుచే ఆ శూన్యము యథార్థవిజ్ఞానమనియు ప్రతిపాదించి నది మైత్రేయనాథుడు. ఈయన వాదమునకు యోగాచార వాదమని పేరు. దీనికి విజ్ఞానవాద మనియు పేరువచ్చినది. నాగార్జునాచార్యులవారి వేదాంతము జన సామాన్యమునకు దురవగాహమైనను, ఆయన ప్రవచించిన మాధ్యమిక వాదము లలిత కళోపాసనకు ముఖ్యముగా శిల్పకళకు ఆంధ్రదేశములో అత్యద్భుతమైన దోహదము కల్పించినది. యథార్థమునకు నాగార్జునునకు పూర్వమే అశోకుని కాలమునుండి ఆంధ్రదేశమున అమరావతి, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, గుడివాడ మున్నగు సంఘారామములలో చైత్య వాదము అంకురించి ప్రవృద్ధమాన మగుచున్నది. అమరావతీస్తూపము బౌద్ధశిల్ప రాజధానిగ అవతరించినది.

శిల్పము,మతముతో ముడివడి ధర్మదాంపత్య జీవితమును సలుపుట అధు నాతనులకు అర్థముకాని అంగీకారయోగ్యము గాని సన్నివేశము కావచ్చును. కాని అఖనాటి అజంతా విహారములు ఎల్లోరా కైలాసనాథ శిల్పములు అమరావతీశిల్ప విన్యాసములు అతిలోక ప్రతిభాన్వితములుగా యుగ యుగాంతరములు భాసించి నవి. ఒక నవనాగరక యువకుడు ఒకానొక వృద్ధ విద్వాంసుని ప్రశ్నించెనట. "నేడు అజంతా ఎల్లోరా అమరావతివంటి శిల్పకళ ఏల పునరుద్భవించుటలేదు?" ఆ వృద్ధ విద్వాంసుడు "ప్రాచీనులకు విశ్వాసములున్నవి. నవీనులకు అభిప్రాయ ములు కలవు" అని సమాధానము చెప్పెనట అతిలోక శిల్ప సౌష్టవసంసృష్టికి అభిప్రాయములు చాలవు. నమ్మిన సత్యమునకై ఆత్మాంకితమైన సామర్థ్యము సాధించిన శిల్పము ఆనాటిది.

అమరావతి-భట్టిప్రోలు-జగ్గయ్యపేట-గుడివాడ-గుంటుపల్లి-రామతీర్థము-శాలిహుండము-అల్లూరు-గుమ్మడిదుర్రు-నాగార్జునకొండ-ఉండవల్లి మున్నగు స్థలములలో బౌద్ధ శిల్పములు వెల్లివిరిసినవి. దానవులపాడు-కొండాపురము-అమరాపురము-విజయవాడ-పెనుగొండ మున్నగు స్థలములలో జైన శిల్పము లున్నవి. గోలియందలి బుద్ధ రాహుల సమాగమము, అమరావతిలోని వివిధ

బౌద్ధ శిల్పములు, బుద్ధుని మహాభినిష్క్రమణము, జాతక కథల శిల్పములు, నాగార్జునకొండలోని బౌద్ధ శిల్పములు బౌద్ధ యుగమునకు చెందినవి. జగ్గయ్య పేట మాంధాత జాతకము అమరావతిలోని మహాచైత్యగారోహస్తూప శిల్పము, చంద్రముఖి యక్షుడు ఉదయన కథ, నలగిరిదమనము నాగార్జునకొండలో అజాతశత్రుని బుద్ధ సందర్శనము, జాతక కథలు శిల్ప కళాభిజ్ఞుల నాకర్షించినవి.

"వాస్తవిక జగత్తునందు బందీకృతుడైనవాడు పాశ్చాత్య శిల్పి; భావ ప్రపంచమందు విహరించువాడు ప్రాచ్య శిల్పి. ప్రకృతియే యవన శిల్పికి ప్రమాణమును పరమావధియుకూడ ప్రకృతి కతీతుడైన భారతీయ శిల్పికి శిల్పశాస్త్ర సూత్రములు శాసనములు. దైవారాధన లక్ష్యము" అని కళాభిజ్ఞుల అభిప్రాయము. అందు

"ఆంధ్ర శిల్పి ఉనికి భారతదేశ మధ్యమున. అతడు పట్టిపోవుచున్నది గూడ మధ్యమార్గమే. అతని కళాసృష్టిలో ఇమిడియున్న రహస్యమే యిది" అని శ్రీ మ. ప్రకాశరావుగారి అభిప్రాయము. బౌద్ధ శిల్పముతో బౌద్ధ మతమును విశ్వపరివ్యాప్తము గావించిన అశోక చక్రవర్తి ప్రతిమ యెచ్చటను గానరాకుండుట వింతగ దోచవచ్చునుగాని భారతీయ శిల్పతత్త్వ రహస్యమును అవగతము చేసికొనినవారికది ఆశ్చర్యముగా తోచదు. అమరావతి, జగ్గయ్యపేట మున్నగు శిల్పములలో సమకాలీన వాస్తవికజగత్తు ప్రతిబింబించకపోలేదు. అలనాటి జంత్రవాద్యములు. జంతువులు, వాహనములు, అలంకార సామగ్రి ఆహార్యవిధానములు ఎడనెడ జీవకళలతో సాక్షాత్కరించుచున్నవి. ఆంధ్ర బౌద్ధములో ప్రశస్తికెక్కినది చైత్యకబౌద్ధము. ఇది ధాన్యకటక విహారమున (నేటి అమరావతికే ప్రాచీన బౌద్ధనామము) వర్ధిల్లినది. బౌద్ధమున బుద్ధుడు-ధర్మము-సంఘము-శరణ్యములు. మహాయానము బోధిసత్వాదర్శమునకు ప్రాముఖ్యము కల్పించినది. 'పరోపకారార్థ మిదం శరీరం' అన్నది బోధిసత్త్వుని ఆదర్శము. తాను బుద్ధుడై తరించుశక్తిగలిగి "నిర్వాణప్రాప్తి"కి అర్హతసము పార్జించినప్పటికి తాను నిర్వాణమును నిరసించి పరోపకారార్థము ఎన్నిజన్మలనైన నెత్తువాడు బోధిసత్త్వుడు. ఆంధ్ర బౌద్ధమున అవలోకితేశ్వర బోధిసత్త్వుడేగాక అనేక బోధిసత్త్వులు ఉద్భవించినారు. బోధిసత్త్వ ప్రతిమలు ఆంధ్రదేశమున కొల్లలుగా వెలసినవి.

ప్రాచీన వేంగిలో బౌద్ధారామముల ప్రస్తావన యువాన్‌చాంగ్ రచనలో కన్పించుచున్నది. దీనిని అచలుడు నిర్మించినట్లు ఐతిహ్యము. వేంగికి సుమారు ఎనుబది మైళ్ళలో (20 లీలు) దిఙ్నాగాచార్యుడు నివసించిన పర్వతముపై శిలా స్తూపమునుగూర్చి ఆ చీనా యాత్రికుడు వ్రాసినాడు. కాళిదాసు మేఘసందేశమున దిఙ్నాగాచార్యుని ప్రస్తావన కన్పించుచున్నది. బౌద్ధముతోపాటు తెలుగుదేశమున జైనము విస్తరించినదిగాని జైనమునకు బౌద్ధమునకున్నంత ప్రాచుర్యములేదు. దానవులపాడు, పెనుగొండ, అమరావతి మున్నగుచోట్ల మాత్రమేగాక తెలుగు గడ్డలో పలుతావుల జైనశిల్పములు బయలుపడినవి. దానవులపాడులోని చౌముఖి సుప్రసిద్ధ శిల్పము. విజయవాడ. నడుంబివసతి కంచుమర్రు మున్నగునవి జైన కేంద్రములు. నేటి బోధన్ పురాతన పౌదనపురము. గొప్ప జైనక్షేత్రము. కన్నడమునందు జైన వాఙ్మయము సుప్రతిష్ఠితము ఆంధ్రమందు జైన వాఙ్మయము మృగ్యమగుట వింత. కొల్లిపాక, ఓరుగల్లు, ఆర్యవటము, తాటిపాక, నేదునూరు, రామళ్లకోట మున్నగుచోట్ల జైన శిల్పములు, విగ్రహములు బయల్పడినవి.

ఆంధ్రదేశములో బౌద్ధము అంతరించిన పిమ్మట- సనాతన వైదికమతము ముఖ్యముగా శైవము విజృంభించినది. 'భక్తి' మార్గమును శైవ వైష్ణవ మతములు పునరుద్ధరించుటతో ఎన్నో దేవళములు వెలసినవి. అలనాడు దేవళములేని ఊరు ఆంధ్రదేశమున లేదనియే చెప్పవచ్చును. దేవాలయము సాంఘిక జీవితమున గరిమనాభి యైనది. ఆలయనిర్మాణము శిల్పకళకు దోహదము కల్పించినది. దేవళము ఆనాడు లలితకళానికేతనము, శిల్పవిద్యానిలయము, నర్తనశాల, సంగీతమందిరము, పురమందిరము, విద్యాసదనము. సంపన్నులు భక్తులు దేవుని అంగరంగ వైభవములకై దానములు చేసెడివారు. పాపము దేవళములోని ఏ దేవుడేనాడు నిత్యనైవేద్యములో ఒక మెతుకైన భుజించియుండలేదు ఆరగించి నది అచటి భక్తులే. 'దేశమంటే మట్టికాదోయ్-మనుజులోయ్' అన్న నేటి నినాద మును ఆనాటికి అన్వయించినచో 'దేవుడంటే దేవళము కాదోయ్'- 'దేవళములోని మనుజులేనోయ్' అనవలసియున్నది. దేవుని పెండ్లికి అందరూ పెద్దలే. దేవళము ఊరి ఉమ్మడి సొత్తయి విరాజిల్లినది. అంతేగాక, దేవుని సన్నిధిలో ఇంద్రియ కాలుష్యము మానవుల మనస్సులపై దుష్ప్రభావము వహించుటకు అవకాశము తక్కువయని భావించి ప్రాచీనులు అచట నాట్యకైంకర్యముగూడ ఏర్పాటుచేసి

నట్లు భావింపనగును. దేవదాసి దేవునియెదుట అభినేత్రియై నిలిచినది. దేవాలయ ధ్వజస్తంభమునందలి చిరుగంటలకు శ్రుతిగల్పుకొని నర్తకి కింకిణీ నిక్వణములు పరిఢవిల్లినవి, కాని- దేవదాసీ విధానమునకు యుగాంతరములలో కాలదోషము పట్టినది. అది విషయాంతరము. పౌరసమితి ఎన్నికలుగూడ దేవళమున దేవుని సన్నిధిలో జరుగుచుండెడివి. ఆ ఎన్నికలలో అభ్యర్థులందరకు సమానావకాశ ముండుట గమనింపదగినవిశేషము. అర్హతగలవారి పేరులన్నియు శ్రీకుంభమున నుంచి, పసిబాలునిచే తీయించెడివారు. ఆవిధముగా ఎన్నికైనవారు ఆ 'ఊరి'కే పురపాలక సంఘసభ్యులుగా వ్యవహరించెడివారు. ఆంధ్రదేశమున వెలసిన దేవళములు అసంఖ్యాకములు.

చేజెర్ల దేవాలయము ఆంధ్రుల కళాభిరుచికి శిల్పవిద్యాభినివేశమునకు మొదట పేర్కొనదగినది. ఇది కపోతేశ్వరుని కంకితము. ఇది ఆనంద గోత్రజులు కట్టించినది. బౌద్ధయుగమునకు తరువాత ప్రవర్తిల్లిన హైందవయుగ మునకు ఈ దేవాలయము ఒక శిల్పసేతువు. ఇందు చైత్య సంప్రదాయములు విమానము వెనుకటిపైభాగము గజపృష్ఠాకారములో నుండుట గమనింపదగిన విశేషములు. అట్టిదే అయ్యావళిలోని దుర్గాలయము. తెలుగువారై తొలుత తెలుగుదేశము నేలిన పల్లవులీ సంప్రదాయమును మహాబలిపురమున అనుకరించి నట్లు శిల్పవేత్తల అభిప్రాయము. అయ్యావళి, ఉండవల్లి, మొగల్రాజపురము నందలి గుహాలయ శిల్పములు ఔత్తరాహదాక్షిణాత్య శిల్పపద్ధతులకుకూడలులుగా ఎన్నవచ్చును, ఉండవల్లి గుహాలయములు అంతస్థులుగలవి. అవి తొలిదశలో బౌద్ధశిల్పములు. మలిదశలో హైందవశిల్ప విరాజితములు. చాళుక్యుల కాలమున విజయవాడ జమ్మిదొడ్డిలో, బిక్కవోలు సమీపమునగల జీర్ణదేవాలయములో చాళుక్యులనాటి శిల్ప కళాపరిణామము విదితమగుచున్నది. ఉండవల్లిలో త్రివిక్ర మావతారము, నరసింహమూర్తి, గోవర్ధనధారియైన గోపాలకృష్ణుడు, బిక్క వోలు నటరాజమూర్తి కోష్ఠపంజరము ఎన్నదగినవి. అయిన- శైవ శిల్పము బౌద్ధమునకు తరువాతనే ఉద్భవించినట్లు ఎంచరాదు. క్రీస్తు పూర్వము రెండవ శతాబ్దినాటిదిగా చరిత్రకారులు ఎంచుచున్న గుడిమల్లములోని శివలింగము నిరుప మాన నిదర్శనము. ఈ విగ్రహము వైదిక రుద్రాగ్నుల ఐక్యమును సూచించు చున్నది. అంతేగాక, వైదికమతము శాతవాహన కాలమున నివురుగప్పిన నిప్పు

వలె ఎట్లు అణగియున్నదో సుస్పష్టము చేయుచున్నది. గాథాసప్తశతియందు శివ పార్వతి పరమైన రచనలు అనేకములున్నవి.

గుడిమల్లములోని శివలింగము నిర్మాణరీతిలో ఉత్తరాపథమందలి సమ కాలీన యక్షప్రతిమలను పోలుచున్నది. పైన లింగాకృతి. మధ్య జటాజూట పురుషుడు విస్ఫులింగ విభాసితుడు. అడుగున పాదాక్రాంతుడైన పురుషుని ఊర్ధ్వశరీరము ఈ విగ్రహమునకు వైలక్షణ్యము నాపాదించుచున్నది. గుడి మల్లము శివలింగమునకు - బిక్కవోలు శివమూర్తి కౌమారి గణాధిపతి ప్రతిమ లకుగల పరిణామ వికాసక్రమము అనుశీలింపదగినది. వేములవాడ, అలంపురము దక్షారామముతోపాటు పంచారామములలో, బెజవాడ, కాళహస్తి, వరంగల్లు, అనుమకొండ మున్నగుచోట్ల వెలసిన దేవళములలోగల శిల్పసంపద జగద్విఖ్యా తము. అనుమకొండ రుద్రేశ్వరాలయము, పాలంపేట రామప్ప దేవాలయము లేపాక్షి ముఖలింగము, పిల్లలమఱ్ఱి, పానుగల్లు, పెనుకొండ, శ్రీశైలము, పెద్ద ముడియము, త్రిపురాంతకము, భైరవునికోన, సింహాచలములలో వెలసిన దేవళ ములు శిల్పకళా విరాజితములు. హంపి విజయనగరమందలి లోకోత్తర శిల్పకళా సంపదలో ఆంధ్ర శిల్పులకుగల భాగస్వామ్యము వేరుగా నుడువనక్కరలేదు. దేవళములేగాక రాజప్రాసాదములుగూడ శిల్పకళకు నెలవైనవి. చంద్రగిరిలోని రాజమహల్ విజయనగర చక్రవర్తుల శిధిలసౌధములు ఉదాహరణప్రాయములు. ఓరుగల్లులోని శిల్ప చిత్రాలంకృతమైన తోరణము, త్రిపురాంతకమందలి మహిషా సుర మర్దని, అనుమకొండలోని సహస్రదేవాలయ స్తంభ శిల్పములు - దేవళము లోని నందులు, పెద్దముడియములోని శిల్పఫలకము, హంపి ఉగ్రనరసింహమూర్తి పెనుగొండ దేవాలయ శిల్పములు - తాడిపత్రి చింతల రామాలయమునందలి ద్వారపాలకులు - లోపలి మకరాధిష్ఠిత గంగాదేవి, ముఖలింగమునందలి ద్వాదశ హస్త నటరాజమూర్తి, పాలంపేట రామప్ప గుడిలోని నృత్య భంగిమములు, లేపాక్షి బసవయ్య-లేపాక్షి వీరభద్రేశ్వరుడు, విజయవాడ కుబేరమూర్తి, అలం పురము బ్రహ్మేశ్వరాలయ శిల్పములు నేటికిని చూపరులను సంభ్రమాశ్చర్య వివశులను చేయుచున్నవి. ప్రతి దేవాలయ కుడ్యములందును అష్టాదశ పురాణము లలో, భారత భాగవత రామాయణములలో సుప్రసిద్ధములగు సన్నివేశములను శిలాఫలకములుగా చెక్కి ప్రతిష్ఠించుట పరిపాటి. అందుచేత ఆంధ్ర శిల్పము ఘనీభవించిన విజ్ఞానముగా విఖ్యాతిగాంచినది, అయినతే ఆ శిల్పులు తమ పేరులను

గాని, విగ్రహములనుగాని యెచ్చటను చెక్కకోలేదు. ఆంధ్ర శిల్పి వరించిన యీ స్వచ్ఛందమైన అజ్ఞాతవాసము అభినందింపదగినది. ఈ శిల్ప కళకు ప్రోత్సాహమును కల్పించిన రాజపోషకుల ప్రతిమలుకూడ ప్రాచీన శిల్పకళలో కన్పింపవు. కాని కోరుకొండ కొండపై ఆలయమునందు ఆలనాటి రాజు ముమ్మడి నాయకుని విగ్రహము అతని భార్య ప్రతిమ కన్పించున్నవి సర్పవరములోని ఆలయ స్తంభముపై కొమరగిరి ప్రతిమ ఉన్నదందురు. తిరుపతిలో శ్రీకృష్ణ దేవరాయలు, చిన్నాదేవి, తిరుమలదేవి లోహప్రతిమలున్నవి. అయిన-అవి యథార్థ ప్రతికృతులా? లేక సాంకేతిక విగ్రహములా? అని సందేహించు వారున్నారు. కాని తిరుమలరాయల విగ్రహము చూచిన యథార్థ ప్రతికృతి అని పించును విజయనగరములో విద్యారణ్యస్వామివారి విగ్రహమున్నది. ఆయన దేవాలయమునకు తరలివచ్చు ఊరేగింపు చిత్రలేఖనమున్నది ఉభయ విగ్రహ ముల పోలిక గుర్తింపదగినది. అయినను చెవులు, నడుము, ముక్కు, కన్నులు చెక్కనపుడు శిల్పిపై సాంకేతిక ప్రభావము పడియుండవచ్చును గాని అవి నిజ రూపములకు యథార్థ ప్రతికృతులుగనే యెంచనగును.

సకారత్రయమునకు (సౌష్ఠవము, సౌకుమార్యము, సౌందర్యములకు) ఆంధ్ర శిల్పకళ ముయ్యేలగుట్ట. ఈ సిద్ధాంతమునకు ప్రాయికముగ ఆంధ్ర శిల్ప కళయంతయు ఉదాహరణ ప్రాయమైనదే. అయినను- మొగల్‌రాజపురమందలి అష్టభుజ నటరాజవిగ్రహము, భైరవునికోనలోని హరిహరనాథుడు, మొగల్‌రాజ పురమందలి అర్ధనారీశ్వరుడు, పానుగల్లులోని పూవుటీరమందలి లావణ్యవతి, పాలంపేట సాలభంజికలు, లేపాక్షి పద్మినీ పాంచాల పురుషప్రతిమలు, తాడిపత్రి లోని ద్వారపాలకులు, అనుమకొండ ద్వార తోరణములు అనుశీలించినవారికి పై సిద్ధాంతము భూతార్థమనిపించును. ఆంధ్రదేశములోనే గాక కోణార్క, సాంచీ, హలీబీడు మున్నగుచోటులలో సుప్రసిద్ధశిల్పములున్నవి. విజయనగరములో శిల్ప కళ-దక్షిణాపథ శిల్పకళా విజ్ఞానసర్వస్వముగ సాక్షాత్కరించుచున్నది. విజయ నగర శిలారథమునకు మాతృక తాడిపత్రిలోని రాతిరథమున్నది. హలీబీడులోని శిల్పులచేతిలో శిల మైనముముద్దగా మారినదందురు. కాని స్వర్ణకారున కసాధ్యమని పించు నగిషీలు హలీబీడు శిల్పులు శిలలపైచెక్కుట అద్భుతావహ మనిపించును. అట్లే విజయనగరములోని శిల్పకళా వైవిధ్య సర్వస్వము జగదాశ్చర్యకరమైనదే. అయిన ఆంధ్రశిల్పములోని విశిష్టత, అనుశీలింపదగినది, తెలుగు కవులు

కావ్యము అల్లినది "జగద్ధితమ్ముగన్". శిల్పము, శిల్పముకొఱకే గాక తెలుగు శిల్పులు జగద్ధితముగ, ఆంధ్రశిల్పము తీర్చిదిద్దినారు. శిల్పముయొక్క ధ్యేయము విశ్వశ్రేయమైనది.

దేవళములను సందర్శించుటకై దూర దూరములనుండి తరలివచ్చెడి అసంఖ్యాకులైన నిరక్షర కుక్షుల గుండెలలో కూడ ఆజన్మము అక్షయమైన పాథేయముగానుండు తెలుగువెలుగు నిక్షేపించి తేజోమయులుగా తీర్చిదిద్ది వారిని తిరిగి యింటికి పంపించిన కీర్తి ఆంధ్ర శిల్పకళకు దక్కినది.

# ఆంధ్ర చిత్రలేఖనము

భారతదేశమున శిల్పము, చిత్రలేఖనము దేవాలయ వాస్తుశిల్పమునకు ఉద్భవించిన కవలపిల్లలు. పురాతనకాలమున విగ్రహశిల్పి-ప్రాయికముగ చిత్రకారుడై యుండెడివాడు. ఆంధ్ర చిత్రకళ శిల్పకళవలెనే దేవళములకు అలంకార ప్రాయమైనది. మతమునకు అనుబంధమైనది. అందలి వస్తువు ఆధ్యాత్మికము. ప్రయోజనము దైవారాధనము. అనుషంగికముగ శిల్పమునందువలెనే సామాజిక చిత్రములు లౌకిక ప్రతిబింబములు ఎడనెడ సాక్షాత్కరింపనగును. కావున ఆంధ్ర శిల్పమునకు వర్తించిన సూత్రములు, సిద్ధాంతములు చిత్రకళకుగూడ చాలవరకు అన్వయింపనగును.

విశ్వవిఖ్యాతి నార్జించిన అజంతా చిత్రలేఖనములు ఆంధ్రశాతవాహన చక్రవర్తుల కాలములో ప్రప్రథమమున ఉద్భవించినవి. సుమారు సహస్ర సంవత్సరములు ఆ గుహాభ్యంతరములలో వాకాటక చాళుక్యయుగములలో చిత్రకళారాధన కొనసాగినది. "బోధివృక్షపూజ" అను చిత్రలేఖనము భారతీయ చిత్రకళకు వేగుచుక్కవంటిది. "బోధిసత్వపద్మపాణి" చిత్రము ఆసియాఖండ చిత్రసముదాయమంతటికీ మకుటాయమానమైనదిగ గన్పించునని వేత్తల అభిప్రాయము. పది శతాబ్దులలో పరిణామరమణీయమైన చిత్రలేఖనము అజంతా గుహాభ్యంతరములలో సందర్శింపనగును. అజంతాలోని ఒక గుహలో గౌతమీ పుత్ర శాతకర్ణి పేరు చెక్కబడియున్నది. పదవ గుహలోని షడ్దంత జాతకకథ క్రీ. పూ. రెండవ శతాబ్దినాటిదై యుండునని కళావిదుల అభిప్రాయము. అనాడు దక్షిణాపథము నేలినది ఆంధ్ర సాతవాహన చక్రవర్తులు. కావున అజంతా చిత్రలేఖనములు ఆంధ్ర చిత్రకళగనే యెంచుచున్నారు. అంతేకాక అజంతా గుహలలోని శిల్పమునకు అమరావతీ శిల్పమునకు గల కుటుంబసాదృశము జగద్విదితమైనది. "ఫెర్గూసన్" అజంతా శిల్పము భారతీయ శిల్పమునకు పరాకాష్ఠ అని యుగ్గడించియున్నాడు.

శాతవాహనుల పిమ్మట అజంతా చిత్రకళకు అభ్యుదయము చేకూర్చిన వారు వాకాటకులు, బాదామి చాళుక్యులు. సింహళములోని సింహగిరిలోని చిత్రలేఖనములలోని రేఖారచన, మూర్తుల భంగిమ, ప్రకృతిచిత్రణము అజంతా శిల్పమును స్మరింపజేయును. భారతీయ శిల్పముపై చిత్రలేఖనముపై యవన పారశీక సంప్రదాయముల ప్రభావము కానిపించుచున్నదని విన్‌సెంట్ స్మిత్తు అభిప్రాయము. ఇచ్చిపుచ్చుకొనుటలో గడిదేరినది ఆంధ్రసంస్కృతి. అదియును గాక ఆంధ్రుల సముద్రాంతర వర్తకమార్గములు విజ్ఞానవికాసమునకు లలితకళో పాసనకు గూడ రహదారులగుట సహజము.

శిల్పకళకు-చిత్రలేఖనమునకు ప్రకృతిలో ఒక ముఖ్యమైన భేదమున్నది. శిల్పము కాలదోషము పట్టదు. చిత్రలేఖనములు ఎన్నో కాలగర్భమున లీనమై పోవుట సహజము. అందుచేతనే అలనాడు చక్రవర్తులు కళాకారులు అజంతా గుహాభ్యంతరములలో అంత భద్రముగా ఆ చిత్రలేఖనములను భద్రపరచి యున్నారు. శిల్పకళ ఆచంద్రతారార్కముగ నిలువవచ్చును. చిత్రలేఖనకళ అజంతాలోవలె "అసూర్యంపశ్య"గ చిరకాలము బ్రదుకవచ్చును. చిత్రకళకు బాలారిష్టదోషములు బహుళములు. అందుచేత-ప్రాచీన చిత్రకళలో మనకు మిగిలినది ఎంత? ఒకశాతమైన ఉండునా? అని నివ్వెరపోవువారున్నారు. అయితే నిలిచియున్న ఒకశాతమునుబట్టి మిగిలినది ఊహించుకోవలసినదే.

విజయనగర సామ్రాజ్యమున చిత్రకళ అభ్యుదయము చెందినది. జిన కంచిలోని వర్ధమానదేవాలయమున చిత్రములు రెండవ హరిహరరాయలనాటివని (1377-1404), ఆనెగొందె ఉచ్చయప్ప మఠములందలి కొన్ని చిత్రములు, హంపీ విరూపాక్షస్వామి ఆలయచిత్రములు 15శతాబ్దినాటివని, వరదరాజస్వామి దేవళములందలి చిత్రములు 16వ శతాబ్దినాటివని చరిత్రకారుల అభిప్రాయము. లేపాక్షి, సోంపల్లిలోని చిత్రములు 16 వ శతాబ్ది మధ్యమునకు చెందినవి. ఆనె గొందెలోని చిత్రములు అత్యుత్తమశ్రేణికి చెందినట్లు కళావేత్తలు భావించు చున్నారు.

'చిత్రకళ'-చిత్రలేఖనములకంటె పురాతనమైనదనుట నిర్వివాదాంశము. కాళిదాసు మేఘసందేశములో యక్షుడు ప్రేయసి చిత్తరువును బాష్పవిలువిత నేత్రుడై వ్రాయలేకపోవుటను అభివర్ణించును. అట్టివర్ణనమే అభిజ్ఞానశాకుంతళ

మున, విక్రమోర్వశీయమున, మాళవికాగ్నిమిత్రమునగూడ కన్పించుచున్నది. ఆనాటి చిత్రలేఖనమున వాడిన రంగులను ఎట్లు తయారుచేయగల్గిరి? గైరికాది ధాతువులచే రంగుపదార్థములు నిర్మించినట్లు సూచనలేగాని అసలువిషయము నేటి వరకు తెలియరాకున్నది యుగయుగాంతరములలో రాజప్రాసాదములను దేవాలయములను అలంకరించిన చిత్రలేఖనములు కాలగర్భమున కలిసిపోయినవి.

ఆంధ్రుల చిత్రకళ లలితకళగా నిర్వహించిన భూమికతోపాటు, మచిలీపట్టణము ముప్పనగుచోటుల కలంకారీపనులలోను కాళీకావడిపటములపై దశావతారపు బిళ్లలపై కొండపల్లి ఆటబొమ్మలపై మేలిముసుగు వేచికొనివినోదించినది.

నవ్యాంధ్ర చిత్రకళ స్వాతంత్ర్యోద్యమ సమయమున యేర్పడిన సాంస్కృతిక పునర్వికాసములో పునర్భవించినది. రాజమహేంద్రవర ప్రభుత్వ కళాశాలాధినేత ''కూల్డ్రే దొర'' వర్థమాన చిత్రకారులకు గల్గించిన భవ్యకవితావేశము స్మరణీయము. శ్రీ దామెర్ల రామారావుగారి చిత్రలేఖనమును పాశ్చాత్యులు ప్రశంసించినారు. ఆంధ్రరత్న శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు

దామెర్ల రాముణ్ణి సీమలో మెచ్చారు
అడవి బాపడి పేరు పడలేదింక

అని తమ సహజ పరిహాసధోరణిలో ప్రశంసించినారు. రాజమహేంద్రవరములో దామెర్లవారి కళాభినివేశమునకు సంవదించునది రాయలసీమలోని సి. యన్. వెంకటరావుగారి చిత్రలేఖనములు. శ్రీ వేంకట్రావుగారి ''గోదావరి'', అడివి బాపిరాజుగారి సముద్రగుప్తుడు-శ్రీ దామెర్ల రామారావుగారి సిద్ధార్థుని రాగోదయము-శ్రీ అంకాల సుబ్బారావుగారి నాగార్జునాచార్యుడు నూతన యుగోదయ రోచిస్సులు విరజిమ్ముచున్న చిత్రలేఖనములు.

ఆధునాతన యుగములో ఆంధ్ర చిత్రలేఖనములు అగ్రస్థానము వహించునవి ఎన్నియో ఉద్భవించుచున్నవి.

ఆంధ్ర చిత్రలేఖనమునకు ఉజ్జ్వల భవిష్యత్తు ఉన్నది. క్రొత్త పాతల మేలుకలయిక- ప్రాక్ప్రతీచీ సంప్రదాయ సమ్మేళనమునకు నవ్యాంధ్ర చిత్రకళ ధ్వజప్రాయమైన మనోజ్ఞ నిదర్శనమై ముందంజ వేయుచున్నది.

ప్రపంచపరివ్యాప్తముగ- "అభినవ చిత్రలేఖనము" సరికొత్త ఆహార్య ధారణతో అవతరించుచున్నది. రష్యా ప్రధానిగా నున్నపుడు 'కృశ్చేవ్', ఈ చిత్రలేఖనములు చిత్రకారుని కుంచెతోగీసినవా ? గాడిదతోక విసరుపాటువలన యేర్పడినవా ?" అని అభినవ చిత్రకళా ప్రదర్శనమును గాంచి విస్తుపోయి పలికెనట.

"గోడపైన కొట్టె గాడిద తోకతో
గ బురదగుంట వెడలి వచ్చి
వ్య చిత్రలేఖనమ్ములో అల్లదే
చ్చెననిరి జనులు స్వర్ణయుగము".

అని వేడినిట్టూర్పు వెలిబుచ్చువారు విశ్వమందెల్లెడ గలరు. అది తాత్కాలిక నిర్వేదము. ఆంధ్ర శిల్పకళయందు వలెనే, ఆంధ్ర చిత్రలేఖనముకుగూడ అంత రాత్మ "సౌష్ఠవము, సౌకుమార్యము, సౌందర్యము"అను సకారత్రయ సమ్మేళ నమునకు అంతర్లీనమైన చైతన్య స్రవంతియే. కాల మహా స్రవంతిలో ఎన్నెన్ని మనోహర బుద్బుదములు తాండవించి అంతరింపలేదు? గండశిలల వాస్తుశిల్ప వైచిత్రి దూరపుకొండల నునుపు సొగమంచుతెరల లీలలు- ఆమనిపూల సోయ గములు, నీలాలనింగి కవ్వలి వెలుగులు, సంజ కెంజాయలు, శరజ్జ్యోత్స్నసుష మాసౌకుమార్యములు, సెలయేటి వంపులు, కదలి కెరటాల వంపులు సొంపులు సమస్త ప్రకృతి సౌందర్య సర్వస్వమును జీవనాడితో స్పదించు మానవ మాన సిక చైతన్య స్రవంతిలో రంగరించి పునఃసృజించుటయే నాటికి నేటికి ఏనాటికి ఆంధ్ర చిత్రకారుని ధ్యేయము.

# ఆంధ్ర నాట్యకళ

నాట్యకళ ఏ జాతిలోనైనా ప్రాక్తనమానవునితోనే ఉద్భవించుచున్నది. ఆదిమమానవుడు తనహృదయము రసతరంగితమైనప్పుడు ఆనంద తన్మయత్వముతో చిందులుత్రొక్కినాడు. ఆదిమమానవుని ఆ ఆటవిక తాండవము-నృత్తమునకు ఆద్యప్రకృతి. అనగా పాదవిక్షేప హస్తవిన్యాసపూర్వకమైన నృత్తముతో పాటు అతని నోటివెంట వెడలిన తాళలయాన్వితమైన నాదము సంగీతమునకు ఆద్య ప్రకృతియైనది ఈవిధముగా నృత్తగానకళలు శరీరములు కలిసి పుట్టిన కవలబిడ్డలు

నటరాజు లీలాతాండవమును సృష్టించుకొనిన భారతీయ సంస్కృతిలో నాట్యమునకు గల ప్రాముఖ్యము వివరింప అనవసరము. భరతముని నాట్యవేద ప్రోక్త. అయితే నాట్యకళ భరతమునికంటె పూర్వమే ఉద్భవించినదనుట నిర్వివాదాంశము.

ఆంధ్రదేశమున నాట్యకళకు ఒక విశిష్టత ఉన్నది. కేరళదేశమున 'కథకళి' నాట్యము సుప్రసిద్ధము; కథాకళిలో మూకాభినయమే. తెలుగుదేశమున నాట్యసంప్రదాయము సంగీతబద్ధము. 'నృత్తంచ వాద్యంచ గీతంచ' సంగీతమని ప్రాచీన సంప్రదాయము. ఆదిమమానవుని ఆటవికతాండములో ఒక విన్యాస విక్షేపాత్మకమైన నృత్తము యుగయుగాంతర పరిణామవికాసములో చతుర్విధాభినయ పరిపుష్టమై నాట్యమైనది. తాళలయాన్వితమైన నాదము గానకళయైనది. అర్థభావసమన్వితమైన శబ్దము కవిత్వమైనది.

ఆంధ్రనాట్యకళ- మూడు మహాకళలు నృత్తము, గానము; కవిత్వము సంగమించిన కళాప్రయాగ. గానము జంత్రగాత్ర సమన్వితమని వేరుగ చెప్ప నవసరములేదు.

అందుచే ఆంధ్ర నాట్యకళ పరిపూర్ణతా పరిణామ రమణీయమైనది.

ఆంధ్రులకు నృత్యకళపైగల మక్కువ అమరావతీ శిల్పములలోగూడ ప్రతిబింబించినది. బ్రిటిష్ మ్యూజియము భద్రపరచిన అమరావతి శిల్పఖండిక నృత్య దృశ్యమును చిత్రించునదే అందు ఒక నర్తకి నృత్యము చేయుచుండగా సహవ్రత యొకతె వేణువూదుచున్నది. ఒకతె పల్లకి మీటుచున్నది.

ఆంధ్రదేశమందలి శిల్పములలో అమరావతి నాటినుండి అధునాతన శిల్పముల వరకు నృత్యమును వస్తువుగా స్వీకరించినవి కోకొల్లలు. నాట్యభంగిమలు విజయవాడనుండి విజయనగరమువరకుగల శిల్పములలో కన్పించుచున్నవి. శ్రీశైలము, నాగార్జుననికొండ శిల్పములందేగాక నాట్యభంగిమలు చెక్కని దేవళము తెలుగుదేశమున లేనేలేదని చెప్పవచ్చును. తెలుగుదేశమున నాట్యముకూడ లలితకళలతోపాటు దేవళమునే ఆశ్రయించినది. దేవళమునకు దాన మిచ్చుటలో అంతర్యము 'అంగరంగ వైభవము' కొనసాగించుట. అంగవైభవమనగా ప్రసాదము. నిత్యనైవేద్యము. రంగవైభవములో నాట్య గానకళలు ప్రాధాన్యము వహించుచున్నవి. చాళుక్యులనాటి ఒక శాసనము ఉదాహరణ ప్రాయము. నర్తకీ పోషణమే గాక 'త త-ఘన- సుషిర- ఆనద్ధ పరిపోషణ, దానములకు లక్ష్యము.

తతములు - వీణ మున్నగునవి.

ఘనములు - కంచుతాళములు మున్నగునవి.

ఆనద్ధములు - మృదంగము ఢక్కా మొదలగు చర్మ వాద్యములు.

సుషిరములు - పిల్లనగ్రోవి మున్నగునవి.

దేవళమునకు సంబంధించిన పరిజనములో గాయక మార్దంగిక నర్తకీ జనమునకు వంశక్రమానుగతములైన మడిమాన్యములు లభించినవి. తెలుగు దేశమునందలి దేవాలయములలోని నృత్యశిల్పములలో పేర్కొనదగినవి పాలంపేటలోని రామప్పదేవాలయము లందలివి. కాకతీయుల కాలము నృత్యకళకు స్వర్ణయుగమని భావించుచున్న వారున్నారు. వరంగల్లు కోటలోని స్వయంభూ లింగేశ్వర దేవాలయమునందలి శివతాండవ శిల్పము, రామప్పదేవాలయములో అనేక నృత్యభంగిమ శిల్పములు కాకతీయుల కాలమున వెలసినవే. కాకతి గణపతి దేవ చక్రవర్తి సామ్రాజ్యమున గజసాహిణిగా సుప్రసిద్ధుడైన జాయప సేనాని రచించిన నృత్యరత్నావళి కూడ అనాటిదే. అతడీ ఉపగ్రంథమును క్రీ॥శ॥ 1254 లో రచించినట్లు చెప్పుకొన్నారు. తెలుగువారి నాట్యకళా రసికతను జాయప

సేనాని రచించిన నృత్త రత్నాకరము దక్షిణాపథ మంతయు తరతరాలుగా వెల్లివిరియ జేసినది. పాలంపేట రామప్ప దేవాలయమునందలి నృత్యభంగిమలు నృత్త రత్నావళిలోని నృత్యవర్ణనలకు ఉదాహరణప్రాయములని చెప్పుచున్నారు.

జాయపసేనాని 'గీత రత్నావళి' అను గ్రంథమునుకూడ రచించినాడు. కాని ఆ గ్రంథము నేడు లభించుటలేదు. నృత్త రత్నాకరమున సంప్రదాయ సిద్ధమైన ప్రాచీన నృత్యకళా విశేషములేగాక దేశీయ నృత్య విశేష వివరణగూడ ఉన్నది. అందు పేరణి, ప్రేఖణము, రాసకము, చర్చరి, నాట్యరాసకము, దండరాసకము, శివప్రియము, చిందు, కందుకము, ఖాండికము, ఘంటసరిచరణము, బహురూపము, కోలాటము అను జానపద నృత్యవిశేషముల వివరించి యున్నాడు. పాల్కురికి సోమనాథుడు, శ్రీనాథుడు మున్నగు కవుల రచనలలో నాట్యవిశేషములు కన్పించుచున్నవి

కాకతీయులనాటి నాట్యకళాభినివేశము రెడ్డిరాజులకాలములోగూడ విస్తరించినది. కొమరగిరి-కొండవీటి రెడ్డిప్రభువు వ్రాసిన "వసంత రాజీయము" సుప్రసిద్ధమైనది. ఆ గ్రంథము నేడు లభింపకపోయినను ఆ గ్రంథములోని ఉద్ధారములు కాటయవేమారెడ్డి, మల్లినాథుడు, కుమారస్వామి, నాదెండ్ల గోపన మంత్రి ఉటంకించియున్నారు.

రేచెర్ల రాజన్యులలో సర్వజ్ఞ సింగభూపాలుడు రచించిన రసార్ణవ సుధాకరమున నాట్యవిషయము నభివర్ణించినాడు.

ఆంధ్ర నాట్యకళనుగూర్చి ముచ్చటించునప్పుడు పేర్కొనవలసినవి మూడు ముఖ్య విషయములున్నవి.

(i) ఆంధ్ర నాట్యము : జంత్రగాన కవితా సాహచర్యముచే పరిపూర్ణతా పరిణామ రమణీయమైనది.

(ii) నాట్యకళ : అంతర్వాహినిగాగల యక్షగానములు ఆంధ్రమున తామరతంపరలు.

(iii) పదసాహిత్యము - కేవలము నాట్యాధారమైనది, తెలుగువారి విశిష్టత.

తెలుగులో ఎన్నో పదములు ఉద్భవించినవి. "కావ్యేషు నాటకం రమ్యమ్" అన్నారు సంస్కృత విద్వాంసులు ఏలన అందు ప్రాక్తన మానవుని హృదయములో ప్రప్రథముగ ఉద్భవించిన నృత్త-గాన-కవితా కళలు పరిణితిచెంది సంగమించినవి. అట్లయిన తెలుగు పదము కవిత-గానము-నాట్య కళలకు ముయ్యేల గుట్ట అయినది. పదములలో క్షేత్రయ్య మువ్వగోపాల పదములు సుప్రసిద్ధములు.

తరతరాలుగా పదములను అభినయించినది ఆంధ్రదేశమున దేవదాసీ బృందము. ఆంధ్రదేశ చరిత్రలో వారు నిర్వహించిన పాత్ర విశిష్టమైనది. రంగాజమ్మ - విజయరాఘవనాయకుని కొలువులో కనకాభిషేకము నందనది. ముద్దుపళని కవయిత్రి.

కాకతి ప్రతాపరుద్రుని ప్రణయిని మాచల్దేవిని గూర్చి క్రీడాభిరామము వర్ణించుచున్నది. కొమరగిరి కొలువులోని లకుమాదేవి నృత్యప్రావీణ్యము జగత్ప్రసిద్ధికెక్కినది. విజయనగరమున వారి ఐశ్వర్యము నిరుపమానమైనదని విదేశీయుల అభివర్ణన.

ఆంధ్రవాఙ్మయము రసిక చక్రవర్తులకు ప్రసాదించిన బిరుదావళులలో అగ్రగణ్యమైనది 'రాయవేశ్యాభుజంగ' బిరుదము.

ఆంధ్ర నాట్యకళను గూర్చిన ప్రస్తావన 'కూచిపూడి' భాగవతులు లేనిదే సమగ్రముకాదు. కూచిపూడి అగ్రహారికులు ప్రాచీన సంప్రదాయములతోపాటు కలాపములను నిర్మించినారు. సిద్ధేంద్రయోగి వారి కులగురువు. 'కూచిపూడి' మొవ్వగోపాలునకు సమీపమునందే కృష్ణాతీరమునందున్నది. వారి భామాకలాపము నృత్యసంప్రదాయ సర్వస్వము అని చెప్పవచ్చును.

ఆంధ్ర నృత్యకళను దిగ్విజయయాత్రకు తీసుకొనివెళ్ళిన గౌరవము కూచిపూడి వారికే దక్కవలసియున్నది. వారిది కూచిపూడి అగ్రహారం- వారు 'కులమున బ్రాహ్మణవారం'. "మేముండేదీ ఒక వారం" అని ఊరూర పర్యటించెడివారు. కోరుకొనేది మెడలోని 'చంద్రహారం'. యతి ప్రాసలు తెలుగు కవితకు మృదంగ-వ్యాపారము నిర్వర్తించునని తెలుగువారు మురిసిపోవుటకద్దు. అంతేగాక అంత్యాను ప్రాసములోని నాదగాంభీర్యమును తెలుగుభాషకు అందించి

దిగ్దిగంతములు ప్రతిధ్వనింపజేసి 'నాట్యభేరి' ప్రయోగించిన శ్రీ కూచిపూడి వారికి దక్కినది 'కూచిపూడి'లో ఆంధ్ర నాట్యకళ విశ్వజనీనమైన నాట్య విజ్ఞాన సర్వస్వమైనది.

నవీన యుగమున ఆంధ్రదేశమున నాట్యకళలో క్రొత్తపాతల మేలికల యికతో క్రొంగ్రొత్త రూపకల్పన చేయుటకు వర్ధిష్ణువులైన యువకులు కృషి చేయుచున్నారు. నాట్యము ఈనాడు దేవళము నాశ్రయించుటకు వీలులేదు. దేవళముల నందియున్న చెరువులు పసరుకోనేరు లైనవి. "ఆంధ్ర నృత్యకళ"కు అంతరాత్మ, సౌష్ఠవము-సౌకుమార్యము- సౌందర్యములకు అంతర్వాహినియైన చైతన్య స్రవంతియే.

ఆంధ్ర నృత్యకళలో నూత్న యుగోదయమునకు సమయ మాసన్నమైనది. అవిగో అరుణోదయకాంతులు!

# ఆంధ్ర గానకళ

గానము విన్నచో ఎదదగ్గమ్మిన కమ్మదనమ్ములో అవా
జ్మనస వేద్యమైన సుకుమార గభీర విశాలదివ్య భా
వానుభవమ్మెదో పుడమి కవ్వలి వెల్గుల త్రోవ చూపు స
ద్యోనివృతప్రసన్న రుచిరోజ్వల హర్ష మహాసమాధిలో

సంగీతము అపాతమధురమనియు, సాహిత్యము ఆలోచనామృతమనియు విద్వాంసుల అభిప్రాయము.

"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసమ్ ఫణిః"
అన్నారు పెద్దలు.

"పరవశత్వము చెంది పడగ విప్పుచునాడు
నాగస్వరము విన్న నాగు బాము"
కో యని కవ్వింప కో యని కోయిల
కూయసాగు గొంతునెత్తి.

జోలపాటలకు శిశువులు హాయిగా నిదురించుచున్నారు. అల వ్రేపల్లెవాడలో వేణుగానలోలుడైన కృష్ణుడు గోపాలుడు. ఈనాడుకూడ సంగీతమువలన ఆవులు ఎక్కువ పాలు చేపునని పరిశోధనలవలన తేలినదనుచున్నారు. సంగీతము ఔషధములవలన కుదురని వ్యాధులను నయము చేయగలదని అధునాతన శాస్త్రజ్ఞుల అభిభాషణము.

పదమునకు గల అర్థము పరిమితమ్ము
వివిధభాషలు విలసిల్లు విశ్వమందు
గుండె మాటాడ వేరొక గుండెతోడ
గాన మెల్లమానవులకు ఏకైకభాష.

సంగీతము వసుధైకభాష.

ద్వితీయ ప్రపంచ సంగ్రామమున మాల్టా ద్వీపములో వివిధదేశ భటులు చేరిన సన్నివేశమును ఒక ఆంధ్రుడు అభివర్ణించినాడు. అచ్చట చేరినవారిలో అనేక భాషలవారున్నారు. అందరు వారివారి సంగీతమును పాడి వినిపించుచున్నారు ఆంధ్ర సోదరుడు వేణువుపై "మధురా నగరిలో చల్లనమ్మబోదు" అను ఆనందభైరవి పదము ఆలపించినాడు. తాళము వేసినవారున్నారు. తల లూపినవారున్నారు- వయలినుపై అనుసరించి-అనురూపస్వరాలాపన సాగించినవారున్నారు. అందులో కొందరు లేచి నృత్యము చేయసాగినారట. ఆ నృత్యము చేసినవాడు కెనడా దేశస్థుడు. అతనికి తెలుగు ఒక అక్షరముగూడ రాదు. జోలపాటకు పరవశమగు శిశువున కే భాష తెలుసు? అందుచేతనే

సంగీతము ఆపాతమధురమని ప్రకటించినారు ప్రాచీన విద్వాంసులు.

సాహిత్యమునకు పరమావధిగా ఆలంకారికులు చెప్పిన "సద్యః పర నిర్వృతి" సంగీతములో తత్క్షణము సంప్రాప్తించుచున్నది.

అనిన - సంగీతములో ఆలోచనామృతమేమీ లేదని చెప్పుట కాదు.

సంగీత సాహిత్యములు గంగా యమునలవలె స్వకీయ హృదయములో సంగమించిన పండిత మూర్ధన్యులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు "సంగీతము ఆపాతమధురము. సాహిత్యము ఆలోచనామృతము అన్న సంస్కృత సూక్తి సాహిత్యాభిమాన మెక్కువగా, సంగీతానుభవము తక్కువగా నున్నవారు ఎవరో అన్నమాట" అని పూర్వపక్షము నెలకొల్పినారు. తరచి తరచి చూచిన సంగీతము-ఎంత లోతైనది?--అందులో ఆలోచనామృతము లేదా? నిస్సందేహముగా ఉన్నది. అయితే సంగీతము ఆరంభమున ఆపాతమధురము. పామరులకుగూడ ఆపాతమధురము. సంగీత విద్వాంసులకు, వాగ్గేయకారకులకు అది సాహిత్యమువలెనే ఆలోచనామృతమును కాగలదు. సంగీతమునకు సహజసిద్ధమైనది సద్యోరసప్రతీతి. అందుచే సంగీతము ఆపాతమధురము. విశ్వజనీనమైన కళ. అది వసుధైక భాషమాత్రమేగాక సకలప్రాణి సమానభాష. సంగీతమునకు గాంధర్వము పర్యాయపదము. భౌమ్యావరణమును సులభముగ అతిక్రమింప గలుగునది సంగీత సాహచర్యమువలననే. అందుచేతనే సంగీతము మోక్షమునకు రాచబాటయై సంగీత సంకీర్తనము భక్తియోగ సాధనమైనది. సంసార తరణోపాయ మైనది.

సంగీతరత్నాకరకారుడు, సంగీతమహత్వము నుగ్గడించుచు "ధర్మార్థ కామమోక్షాణాం ఇదమేవైకసాధనం" అని ఎలుగెత్తి చాటినాడు. సంగీతవిద్యకు ఇతరవిద్యలకు ఒక సుస్పష్ట భేదము లోకములో అనుభవసిద్ధము. అన్నివిద్యలు నేర్చుకొనిన వచ్చును. ఆజన్మవాసన లేనిదే, అగర్భ నైసర్గికశక్తి లేనిదే-ఎంత నేర్చుకొనిన రాని విద్యలు లలితకళలు-ముఖ్యముగా సంగీతము. అందుచేత సంగీతము దైవదత్తమైన వరప్రసాదమని నమ్మువారున్నారు. ప్రయత్నసాధ్యమైనవి ఇతర విద్యలు. సంగీతము ఆజన్మసిద్ధమైన సామర్థ్యము కానిచో ప్రకృతి సహజసిద్ధమైన ప్రతిభ అనిపించును. అందుచే సంగీతమునకు అతిలోకమైన గాంధర్వము పర్యాయపదమైనది.

ఇక-సంగీతకళలో ఆంధ్రుల అదృష్టము ఎన్నదగినది. ఆంధ్రుల మాతృభాష తెలుగు అజంత భాష. అజంతభాష సంగీతమునకు స్వభావసిద్ధముగ అనువైనదన్న సంగతి సర్వజగద్విదితము. సంస్కృతభాషలో గీతగోవిందమును వ్రాసిన పద్మావతీచరణ చారణ చక్రవర్తి, సంగీత నాట్యకళా కోవిదుడైన జయదేవుడు- హలంతపదములను తప్పించి అజంత దీర్ఘాక్షరముల నెన్నుకొని కూర్చుటతో పదినపాట్లు సంస్కృత పరిజ్ఞానము గలవారికి తెలియనిదిగాదు. కర్ణపేయమైన ఆంధ్రభాష సంగీత సహజ కవచకుండలములతో భాసించునది. ఆ సిద్ధాంతమునకు ఉపపత్తులు.

(i) ఆంధ్రభాష అజంతభాష.

(ii) ఔత్తరాహ భాషలకంటె సాటి దాక్షిణాత్య భాషలకంటె గూడ మొదలు అచ్చుల ప్రాధాన్యమును ఎక్కువగా సంతరించుకొన్నది.

(iii) సంయుక్త వర్ణములను బహుళముగా వియుక్తములు చేసుకొన్నది.

(iv) ద్రుతాంతములైన పదము లెక్కువ. క్రియాంతములు విభక్త్యంతములు బహుళముగా ద్రుతములు.

(v) బహువచనములు 'ల' కారాంతములు. ద్రుత లకారములు మృదువైనవి.

(vi) సంగీతనాదమును వెలువరచుశక్తి అచ్చులకున్నట్లు హల్లులకుండదు- అనునాశికములకుతప్ప.

పూర్వోక్తములైన ఉపపత్తులచే ఆంధ్రభాష దేశభాషలలో మిన్నగా సంగీత కళాభినివేశము సంతరించుకొనుట సహజమే. అంతేగాక ఆంధ్రుల సంగీత కళాభిరుచి ప్రాక్ చరిత్రోదయ సిద్ధమనిపించును. క్రీస్తుశకము మొదటి శతకమునాటి కాళిదాసునాటికే "భరతుడు" దేవర్షి తుల్యుడు. భరతుడు స్వర సప్తకముచే ఏర్పడు శుద్ధజాతులతోపాటు దేశీయ విభాగములైన కొన్నిజాతులను పేర్కొనెను. 1, షడ్జోదీచ్యవతి 2 షడ్జకైశికి 3. షడ్జమధ్యమ 4. రక్తగాంధారి 5. గాంధారోదీచ్యవతి 6. మధ్యమోదీచ్యవతి 7. గాంధారపంచమి 8. ఆంధ్రి 9. నందయంతి 10. కర్మారవి 11. కైశికి.

అందులో ఉదీచ్యములు ఉత్తరదేశ సంబంధులు కాగ "ఆంధ్రి" ఆంధ్ర దేశ సంబంధమైనదనుట నిర్వివాదము భరతమునికి పూర్వమునుండి స్వయం వ్యక్తమగుచున్న ఆంధ్రుల సంగీత కళాభినివేశము వారి మాతృభాష అజంత ముగా పరిఢవిల్లుటకు తోడ్పడియుండవచ్చునని ఊహించుట సత్యదూరము కాకపోవచ్చును. ఎట్లైన - ఆంధ్రులకు సంగీత కళారాధనలో కలిసివచ్చిన గొప్ప అదృష్టము ఆంధ్రభాష.

భరతఖండమున సంగీత విద్యకు మూలపురుషుడు భరతముని. మతంగుడు మున్నగు తరువాతి లాక్షణికులు ఆ మహోద్యమమును కాలక్రమమున నేర్పడిన పరిణామ వికాసములతో ఆ జాతుల రూపమైవిద్యమంతయు గ్రహించి గ్రామరాగములు, ఉపరాగములు, శుద్ధరాగములు; భాషలు, విభాషలు, అంతర భాషలు, రాగాంగములు, ఉపాంగములు, భాషాంగములు, క్రియాంగములు అను పది తెగలుగా విభజించినారు; కాని కాలమహాస్రవంతి లాక్షణికులు ఏర్పరచిన గట్లను త్రెంపుకొని ప్రవహించుచునేయుండును. అయిన అలనాడు యావద్ భారతదేశమునకు సంగీత సంప్రదాయములకు మూలాధారము ఒకటే యైనప్పుడు ఈనాడు కన్పించుచున్న హిందుస్థానీ, కర్ణాటక సంగీతములను విభేదములెట్లే ర్పడినవను ప్రశ్న వచ్చుట సహజము. భారతీయ సంస్కృతి చరిత్రలో ఆంధ్రులు నిర్వహించిన పాత్ర యిట అనుసంధేయము. క్రీ॥శ॥ 1295-1315 నాటివారైన అమీర్‌ఖుస్రూ - అలనాటి ఢిల్లీసుల్తాన్ అలావుద్దీను అమాత్యుడు నేటి హిందూ స్థానీ సంగీత కళకు మూలపురుషుడని ఔత్తరాహుల విశ్వాసము. ప్రతికూల సభ్యతా ఝంఝూమారుతములు వీచుచున్న సమయములో భారతీయ సంస్కృతి

తోపాటు సంగీత సంప్రదాయములుగూడ ఆంధ్రదేశమునకు వలసవచ్చి అతిథి సత్కారమునుపొంది అభ్యుదయ పరంపరాభివృద్ధిగాంచుట చరిత్రవేత్తలకు అనారూఢ విషయముగాదు. అయినను ఆంధ్ర సంస్కృతి సంగీతములు ఇచ్చి పుచ్చుకొను సహన సంప్రదాయమును ఉజ్జగించలేదు. సహానా అఠాణా తిల్లానా మొదలగువానిని కర్ణాట సంగీతము పేరునైన మార్చక ఔత్తరాహులనుండే స్వీకరించినది. అయితే వానిపై స్వకీయముద్ర వేసియే స్వీకరించుట జరిగినది. ఆంధ్ర సంగీతమునకు కర్ణాట సంగీతమను పేరెప్పటినుండి ఏవిధముగా ఏర్పడి నది సుస్పష్టముగా తెలియుటలేదు. పేరునకు కర్ణాట సంగీతమేగాని అది ఆంధ్రుల ఆత్మీయతా ముద్రతో అవతరించి అభ్యుదయ పరంపరాభివృద్ధిగాంచిన సంగతి అందరు ఏకగ్రీవముగ అంగీకరించువిషయమే.

ఆంధ్రుల సంగీతకళోపాసన భరతముని నాటినుండి నేటివరకు అవిచ్ఛిన్న ముగ కొనసాగుచున్నది. అమరావతీశిల్ప కళాఖండములో నాగార్జునకొండ మున్నగు బౌద్ధ శిథిల శిల్పావశేషములలో గన్పించు జంత్రవాద్య విశేషములు నృత్త నర్తకీగణములు పౌరాణిక శిల్పములు దేవాలయ ప్రాంగణములలో గన్పించు నృత్యభంగిమములు ఆంధ్రులు రచించిన సంగీతలక్షణ సారస్వతము తోపాటు లభించుచున్న అసంఖ్యాకములైన కీర్తనలు,కృతులు,పదములు ఆంధ్రుల సంగీతకళాభినివేశమును వేనోళ్ల చాటు ఉదాహరణములు. నన్నయ రాజరాజ నరేంద్రుని ఆస్థానవిద్వాంసులలో వైణిక గాయకులను పేర్కొనినాడు. చాళు క్యులు, కాకతీయులు, రెడ్లు, విజయనగర ప్రభువులు దేవళములలో అంగరంగ వైభవమునకై చేసిన దానములు అసంఖ్యాకములు. ఏ శుభకార్యమునకైనను సన్నాయి, డోలు మొదలగు జంత్రవాద్యములే ఆంధ్రదేశమున వైదిక మంత్ర ములతోపాటు పౌరోహిత్యము నిర్వహించినవి. నన్నయ మహాకవికి పూర్వము నుండి పరిణతిచెందుచు వచ్చుచున్న తెలుగు ఛందస్సునకు ఆహార్యము సంస్కృతమైనను, అంతరాత్మ సంగీతమే. పాల్కురికి సోమన ఎన్నో పదము లను పేర్కొనెను.

ఆంధ్రుల సంగీత రసికతకు నిర్వికల్పమైన నిదర్శనము ఆంధ్రమున వెలసిన సంగీతలక్షణ గ్రంథములు. నృత్త రత్నావళి రచించిన జాయపసేనాని గీత రత్నావళినిగూడ వ్రాసినాడు. ఆ గ్రంథము దుర్లభము. ప్రోలయ వేమారెడ్డి 'నృత్తగీత కళాసల్లీలోపేతోత్సవుడు'. రాచకొండ సర్వజ్ఞ సింగమనాయని

సంగీత రత్నాకరవ్యాఖ్య- సంగీత సుధాకరము గొప్ప ఆంధ్ర రచనలు. సంగీత రత్నాకరమును రచించిన శార్ఙ్గదేవుడు కాశ్మీర పండితుడు దేవగిరినేలిన సింఘణ భూపాలుని ఆస్థానమున కరణము. అతడు క్రీ. శ. 12 వ శతాబ్ది ప్రథమచరణము నాటివాడు ఇందు చరిత్రను అనుశీలించువారు గ్రహింపవలసిన ముఖ్యాంశ మిమిడియున్నది. ఉత్తరభారతములో ఉత్తరపుకొననున్న కాశ్మీరము నుండి దేవగిరికి వలసవచ్చినది శార్ఙ్గదేవుడు మాత్రమేగాదు. అతనితోపాటు ప్రాచీన భారతీయ సంస్కృతిగూడ దక్షిణాపథమునకు వలస వచ్చుటకది చిహ్నము. దేవగిరిలో తాత్కాలికముగ ఆగి అలవుదీర్చుకొన్న ప్రాచీన భారతీయ సంస్కృతి ఆంధ్రదేశము నందలి దేవరకొండ, ఓరుగల్లు, అద్దంకి, కొండవీడు, విజయనగరము మున్నగు ప్రదేశములకు విచ్చేసి ఆంధ్ర సంస్కృతిలో లీనమైనది. శ్రీనాథ మహాకవి కాశ్రయప్రదాతయైన పెదకోమటి వేమభూపాలుడు సంగీత చింతామణి వ్రాసినాడు. క్రీ. శ. 15 వ శతక మధ్యమందు విజయనగర సామంతుడు సాళువ గోపేంద్ర తిప్పభూపాలుడు "తాళ దీపికను" రచించినాడు. తాళ్లపాక అన్నమాచార్యులవారికి ఆశ్రయమిచ్చినది ఆ వంశీయుడైన నరసింగరాయలే. తాళ్లపాక అన్నమాచార్యులవారు 32 వేల కీర్తనలు శ్రీ వేంకటేశ్వరపరముగా వ్రాసిన భక్తుడు, సంగీత విద్వాంసుడు. తాళ్లపాక అన్నమాచార్యులు వ్రాసిన సంకీర్త లక్షణము అను సంస్కృత పుస్తకమును అతని మనుమడు తాళ్లపాక చిన్నయ్య తెనిగించినాడు.

శ్రీకృష్ణదేవరాయల ఆస్థాన కరణికుడు భండారు లక్ష్మీనారాయణకవి రాయల అంతఃపురమున నాట్యాచార్యుడు 'సంగీత సూర్యోదయము' వ్రాసినాడు. ఈ విధముగా ఆంధ్రదేశము భారతీయసంస్కృతి కేవిధముగా ఆలవాలమైనదో భారతీయ చరిత్రలో ఆంధ్రులు నిర్వహించిన పాత్ర అనుశీలింపనగును. అసలు విద్యానగర సామ్రాజ్య సంస్థాపనకు పౌరోహిత్యము నిర్వహించిన విద్యారణ్య స్వామివారే దక్షిణాపథమున ఆంధ్ర సంగీత సామ్రాజ్య సంస్థాపనకుగూడ సూత్రధారియై 'సంగీత సార'మను గ్రంథమును రచించినారు. ఆ గ్రంథము నేడు దుర్లభము. కాని ఆ గ్రంథమే తంజావూరులో ఆంధ్రరఘునాథనాయకులు వ్రాసిన "సంగీత సుధ"కు ఆధారమని అందేయున్నది. ఆంధ్రులు సంగీతములో విశేషపరిశ్రమ సలిపి క్రొంగొత్త రాగములు ప్రస్తరించినారు. 'అచ్యుతరాయ మేళము' ఉద్భవించినది. అచ్యుతేంద్ర రఘునాథభూప మేళము అలనాటి వీణకు

ఏర్పడినది. రఘునాథరాయలు జయంతసేన రాగము కల్పించినట్లు తెలియు చున్నది. సంగీత కళాజగత్తుకు ఆంధ్రులు సమర్పించిన కానుక తెనుగు భాషతో పాటు వీణ.

'రహి పుట్ట జంత్రగాత్రముల రాల్ గరిగించు
విమల గాంధర్వంబు విద్య మాకు'

అన్నది ఆంధ్ర వరూధిని. చెలికత్తె విరహిణియైన వరూథినితో,

వాలారుం గొనగోళ్ల నీవలసతం వాయించుచో నాటకుం
మేళంబైన విపంచి, నిన్న మొదలున్ నీవంటమిం జేసి ఆ
ఆలాపంబె ఆవేళ పల్కెడు ప్రభాతాయాత వాతాహతా
లోలత్తంత్రుల మేళవింపగదవే లోలాక్షి దేశాక్షికిన్.

అన్న మాటలు ఆనాటి ఆంధ్రుల సంగీత రాసిక్యమునకు సాక్ష్యము చెప్పు చున్నవి.

అంతేగాక దీనినిబట్టి అప్పటికింకను వీణలో చలసారికలే యున్నవన్న మాట. తిమ్మన్న పారిజాతాపహరణమున, నారదుడు శ్రీకృష్ణునకు తన వీణను మోయుటకు అందించుచు

"మేళవించినవి సుమ్మీ దీనిమెట్లు"

అను హెచ్చరికలో అప్పటికి వీణలో చలమేళమే యున్నట్లు ఊహింపనగునని శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు సూచించియున్నారు. నేడు వీణలో గన్పించు అచలమేళము సంగీత కళానిధియైన రామరాజభూషణమహాకవిచేతిలో సిద్ధిపొందిన దని ఆంధ్రదేశమునందలి ప్రతీతి కొందరది రఘునాథరాయల కాలమున జరిగిన దనుచున్నారు. ఎట్లయిన వీణ సిద్ధిపొందినది బహుళ పరిశోధనా ఫలితముగ కృతహస్తులైన తెలుగువారి ప్రతిభవల్లనే అనుట మరువరానిది.

ఆంధ్రదేశమున ఆవిర్భవించిన సంగీతలక్షణ గ్రంథములలో 17 వ శతాబ్దిలో పేర్కొనదగినది సోమనాథుని రాగవిబోధము "స్వరరాగముల స్వరూప మింత స్పష్టముగా వివరించు గ్రంథమింకొకటిలేదు"గని శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ

శర్మగారి ప్రవచనము. రాగ తాళ చింతామణి రచించిన శ్రీ పోలూరి గోవిందకవి తన లక్షణ గ్రంథమును గద్య పద్యమయముగా వ్రాసినాడు. 'తాళదశ ప్రాణ దీపిక' కూడా ఇతడు రచించినదే. సంగీతమున తెలుగులో పుట్టినన్ని లక్షణ గ్రంథములు మరి యే భాషలోను ఉద్భవించలేదు తచ్చూరి సింగరాచార్య సోదరుల సంగీత పారిజాతాది గ్రంథములు, వీణ రామానుజయ్యాది సంగీత సర్వార్థ సార సంగ్రహము, శ్రీనివాసయ్యంగారి గానభాస్కరము పేర్కొననగును. ఎట్టియాపురపు సుబ్బరామ దీక్షితులవారి సంగీత సంప్రదాయ ప్రదర్శిని గొప్ప ప్రామాణిక గ్రంధము. సంగీతము నేర్చుకొనుటకు దక్షిణాపథమున తెలుగు భాష నేర్చుకొనుట ఆవశ్యకమైనది. ఈ లక్షణ గ్రంథములకు భవ్యకవితావేశము కల్పించిన లక్ష్యములు తెలుగునేల నాలుగుచెరగుల తామర తంపరలుగ ఉద్భవించినవి. శివాజీ మహారాజునకు గురువైన సమర్థ రామదాసస్వామి, భద్రాచల రామదాసును సందర్శించి కొన్ని తెలుగు పాటలను మహారాష్ట్రమున వ్యాపింప చేసినట్లు తెలియవచ్చుచున్నది. "ఎందరో మహానుభావులు" తెలుగు వాగ్గేయ కారులు ఉద్భవించినారు వారందరకు వందనములు చేసిన త్యాగరాజు చేతిలో ఆంధ్ర గాన సరస్వతి విశ్వరూప సందర్శనము ప్రసాదించినది.

త్యాగరాజు సంగీత సుధార్ణవమై జీవితయాత్ర సాగించి - సంఘమునకు తాను అమూల్యమైన కృతిరత్నములను ప్రసాదించి సంఘమునుండి తిరిపెమును మాత్రమే ప్రతిఫలముగా స్వీకరించి తిరిగిన త్యాగరాజు. పవిత్రమైన జీవితమును గడిపిన ధన్యుడు కావున అతని కృతులు 'తెర తీయగరాదా!' 'శాంతము లేక సౌఖ్యములేదు సారసదళనయనా' 'నిధి చాల సుఖమా రామునిసన్నిధి సుఖమా నిజముగ తెలుపుము మనసా' అనునవి సంగీతముమాత్రమేగాక అచ్చపు ఆంధ్ర సంస్కృతి. నేడు అతని కృతి 'నిధి చాల సుఖమా!' అని "నిధులు" వసూలు చేయుటకు ఆలపించుట జరుగుచున్నది. ఈ జన్మలో త్యాగరాజు సంగీతము అలవడవచ్చును త్యాగరాజు సంస్కృతిని అందుకొనుటకు ఎన్ని జన్మలు కావలెను!

భారతదేశము, చరిత్రలో మధ్యయుగములలో ఉత్తరాపథమున పొందినది సైనిక పరాజయమేగాని సాంస్కృతిక పరాజయముగాదు. భారతీయ సంస్కృతి సైనిక విజేతలను సాంస్కృతికముగ జయించగల్గినది. అక్బరు చక్రవర్తి ఆస్థానమున తాన్‌సేన్ సంగీత సార్వభౌముడుగా ప్రసిద్ధి కెక్కినట్టివాడు.

అతనిగూర్చి లోకములో ఒక కథ ప్రచారములోనున్నది. ఒకనాడు ఆ మొగలాయీ సార్వభౌముడు రసికసమ్రాట్టు అయిన అక్బరు చక్రవర్తి తాన్‌సేన్ గానమునకు పరవశత్వముచెంది అతని సంగీత కళారహస్యమును వివరింప గోరినాడట తాన్‌సేన్ సమ్యక్ సమాధానము - "మా గురుదేవుల కృపాకటాక్షవీక్షణమే". అక్బరు చక్రవర్తి తాన్‌సేన్ గురువుగారికి మొగల్ దర్బారులో సముచిత సన్మానము నేర్పాటుచేయుటకు సంసిద్ధుడైనాడు. కాని తాన్‌సేన్ తన గురువుగారున్న పల్లెటూరి దేవళముపీడి మొగల్ దర్బారుకు రారని చెప్పినాడు. అక్బరు చక్రవర్తి తానే సద్గురు సందర్శనార్థము ఆ పల్లెటూరికి వెడలినాడు తాన్‌సేన్‌తో కలిసి. కోవెలప్రక్క ఉద్యానవనమున ఆ మహానుభావుడు పాడుచున్నాడు. ఒక లేడిపిల్ల అరమోడ్పు కనుదోయితో ఆ గానము ఆలకించుచున్నది. ప్రకృతియే పరవశత్వము చెందిన దాసంజ కెంజాయ లేవెలుగులో. ఆ గురుదేవు డెక్కడ! తాన్‌సేన్ ఎక్కడ! గంగానదీప్రవాహ మెక్కడ! చిరుసెలయేరు జలజల ఎక్కడ అన్నాలట అక్బరు. అంతేగాక తాన్‌సేన్ ఆ గానమంత ఏల అలవరచుకోలేదని ప్రశ్నించినాడట.

తాన్‌సేన్ వినమ్రుడై చెప్పిన సమాధానము విశ్వచరిత్రకు గగుర్పాటు గల్గించినది.

"ఏలినవారు చిత్తగించెదరుగాక.

నేను ఢిల్లీశ్వరుని మెప్పించుటకై గానము చేయుచున్నాను.

మా గురుదేవులు జగదీశ్వరుని కీర్తించుటకై గానము చేయుచున్నారు."

ఆ సమాధానము వ్యాఖ్యాన నిరపేక్షమైనది.

త్యాగరాజు జగదీశ్వరుని ఆస్థాన సంగీత విద్వాంసుడు.

గాంధీమహాత్ముడు అన్నాతురునకు పరమేశ్వరుడు అన్నరూపములో తప్ప సాక్షాత్కరింపలేడని నుడివినాడు. గాయకునకు పరమేశ్వరుని సాక్షాత్కారము కలిగినచో నాదబిందు కళారూపములోనే, త్యాగరాజు నాదబిందు లయాస్వరూపుని సాక్షాత్కరింపజేసుకొనిన మహానుభావుడు. యథార్థమునకు త్యాగరాజు గాయకుడుకాడు గానమే. త్యాగరాజు ఆంధ్రుడగుట ఆంధ్రుల అదృష్టము.

ఆంధ్ర లలితకళ లన్నిటికిని సకారత్రయముగా పేర్కొనదగిన సౌష్ఠవము-సౌకుమార్యము-సౌందర్యములకు అంతర్లీనమైన చైతన్యమే ఆద్యప్రకృతి. ఆ చైతన్యమునకే "తెలుగు వెలుగు" పర్యాయపదము.

తెలుగు వెలుగు ఆంధ్ర శిల్పకళలో నిద్రాణమై పవళించినది. ఆంధ్ర చిత్రలేఖన కళలో ఆ నిదురలో తియ్యని కలలు కన్నది ఆంధ్ర సంగీతకళలో కనులువిప్పి మేల్కొని కంఠము సవరించి ఆలపించినది. ఆంధ్ర నృత్యకళలో లేచి నిల్చి నడయాడుట కుపక్రమించినది. ఆంధ్ర కవితాకళతో విశ్వాంతరాళ మెల్ల విహరింపసాగినది.

"రసో వై సః"

సంగీతార్ద్రా! మధురసధునీ! కావ్యలావణ్యపూర్ణా!
త్యాగబ్రహ్మ ప్రగదిత మహాగాన సామ్రాజ్యరాజ్ఞీ!
శ్రీమన్నాగార్జున నగకళా శిల్ప సాహిత్యధాత్రీ!
విశ్వాదర్శా! విజయతు విశాలాంధ్ర పృథ్వీమతల్లీ.



ఇక్ష్వాకులనాటి శాసనము
అశ్వమేధయాగ హిరణ్యకోటి గోసహస్ర
శతసహస్ర హలప్రదానము.